Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)
స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు స్థాపితం: 1930 జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి
*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 18 • 6-5-2011 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



# అతివిశ్వాసం కొంప ముంచుతుందా!

- ఓటుకు నోటు పంపకంలో జగన్ వెనుకంజ.
- స్థానిక నేతలు, ఓటర్లలో తీవ్ర అసంతృప్తి.
- కాంగ్రెస్ మాత్రం డబ్బు వెదజల్లింది.
- ఎలక్షన్ కమిషన్‌కు మీసాలు తప్ప కోరలు లేవు.
- పులివెందులలో అనూహిత ప్రతికూలత.
- అయినా మూడు లక్షల మెజార్టీ మీద అతివిశ్వాసం.

కడప ఉప ఎన్నికల సమరం పతాక స్థాయికి చేరింది. ప్రచారం ముగిసింది. మాటల తూటాలు రాలడం ఆగింది. ఇప్పుడు అందరి దృష్టి, ఓటరును మచ్చిక చేసుకోవడం మాత్రమే. అందుకు ఒకే ఒక సాధనం – డబ్బు పంపకం. ఎలక్షన్ కమిషన్ హుంకరింపులు తాటాకు చప్పుళ్లకంటే హీనంగా తేలి పోతున్నాయి. కాకి అరుస్తూ వుంటుంది, కరవాడు ఎండుతూ వుంటుందన్నట్లుగా వుంది పరిస్థితి. మద్య ప్రవాహానికి కానీ, డబ్బు పంపకానికి కానీ ఎలక్షన్ కోడ్ ఎంతమాత్రం అడ్డంకి కావడం లేదు. ఎన్నికల కమిషన్ తన నియమాలను రెవిన్యూ, పోలీసు యంత్రాంగం ద్వారా మాత్రమే అమలు చేయాలి. కానీ, ఆ రెండు శాఖలలో రాజకీయ ప్రభావం మితిమీరిపోయి వుంది. ఒక్క ఎమ్మార్వో, ఒక్క ఎస్ఐ లేదా సిఐ రాజకీయ పలుకుబడి లేకుండా పోస్టింగ్ తెచ్చుకొనే పరిస్థితి లేదు. ఎన్నికల కమిషన్ ప్రతాపం ఎన్నికలతో చెల్లు. కానీ రాజకీయవాదులు ఆ తర్వాత కూడా వుంటారు. దానితో జిల్లా అధికారులు కానీ, క్రింది స్థాయి ఉద్యోగులు కానీ రాజకీయవాదులకు బానిసలుగా వుండడానికే మొగ్గు చూపడం సహజం. దానితో ఎలక్షన్ కమిషన్‌కు మీసాలు తప్ప కోరలు లేవని పదే పదే రుజువౌతున్నది. ఇక్కడా అదే జరుగుతున్నది.

అందరూ అనుకొన్నది – ఈ ఎన్నికలలో వైఎస్ జగన్ డబ్బు విషయంలో తన విశ్వరూపం చూపుతాడని. కానీ, ఏ కారణం వల్లనో ఆయన మహా పొదుపరి వలె వ్యవహరిస్తున్నాడు. ఒక్క పులివెందుల తప్ప తతిమా లోక్‌సభ నియోజకవర్గం మొత్తంలో ఓటుకు కేవలం 200 రూపాయలు పంచుతున్నాడు జగన్. ఇది అటు ఆయన ప్రచారంలో వున్న గ్రామస్థాయి నేతలకు, ఇటు ఓటర్లకు కూడా తీవ్ర అసంతృప్తిగా వుంది. చాలా గ్రామాలలో ఓటర్లు 200 రూపాయలు తీసుకోవడానికి నిరాకరిస్తున్నారు. మేము ఎటూ జగన్‌కు ఓటు వేస్తాము కాబట్టి మాకు డబ్బు వద్దని చెప్పి తీసుకోవడానికి నిరాకరిస్తున్నారు. జగన్ వద్ద లక్షల కోట్ల రూపాయలు డబ్బు, ఆస్తులు వున్నాయని జనం నమ్మకం. అంత సొత్తు కూడబెట్టుకొన్నవాడు, అందులో కొంత తమకు ఇవ్వకుండా ఓటు ఎట్లా అడుగుతాడన్నది వారి ప్రశ్న. జగన్ ఓటుకు అంత తక్కువ విలువ కట్టడం చివరి నిముషంలో ఎన్నికల మీద ఎటువంటి ప్రభావం చూపుతుందో అన్న భయం ఆయన అనుచరులలో వ్యక్తమౌతున్నది. తన తండ్రి మీద సానుభూతితో ఓటు వేసే వారికి డబ్బెందుకివ్వాలని వాదిస్తున్నాడట జగన్.

ఈ అవకాశాన్ని కాంగ్రెస్ బాగా వాడుకొంటున్నది. వారు చాలా ప్రాంతాలలో 500 రూపాయల వరకు పంచుతున్నారు. కొన్ని చోట్ల అంతకంటే ఎక్కువ కూడా ఇస్తున్నారు. కాంగ్రెస్‌కు ఓటు వేయాలన్న కోరిక ఏ మాత్రం లేని ఓటర్లు కూడా పచ్చ నోటు చూసి మైమరచి పోతున్నారు. ప్రతి ఇంట్లో కనీసం నాలుగైదు ఓట్లు వుంటాయి కాబట్టి, 500 లెక్కన ప్రతి కుటుంబానికీ కనీసం రెండువేల రూపాయలు దక్కుతున్నాయి. పేద వాడికి ఇది చాలా పెద్ద మొత్తం.

తెలుగుదేశం మాత్రం జగన్‌తో సమానంగా 200 రూపాయల లెక్కన పంచుతున్నది. ఎటూ గెలవని ఎన్నికలకు డబ్బు పంపకం ఎందుకని మొదట చంద్రబాబు స్థానిక నేతలను నిరుత్సాహ పరచాడట. కానీ ఆ మాత్రమన్నా ఇవ్వకుంటే అసలు సోదిలో కూడా లేకుండా పోయిందనే ప్రచారం వస్తుంది కాబట్టి, ఎంతో కొంత అయినా ఓటరు చేతిలో పెడదామని చెప్పి ఒప్పించారట జిల్లా నాయకులు.

మొత్తం మీద కడప ఎన్నికలను ఈ డబ్బు పంపకంలోని తేడాలు తీవ్రంగా ప్రభావితం చేయవచ్చునని పరిశీలకులు భావిస్తున్నారు. ఇప్పటి వరకు వున్న అంచనాలు తారుమారు కావచ్చునన్న సంశయం కూడా కన్పిస్తున్నది. నిన్నటి వరకు కడపలో పరిస్థితి చూసిన వారెవరైనా జగన్ గెలుపుకు ఢోకా లేదనే అంచనా వేశారు. మెజార్టీ కూడా లక్షలలోనే వుంటుందని లెక్కకట్టారు. ఆ అంచనాలతో కల్గిన అతి విశ్వాసం జగన్ కొంప ముంచుతుందా అన్న ఆందోళన ఆయన అనుచరులలో కన్పిస్తున్నది. దీనివల్ల గెలుపుకు ప్రమాదం లేకపోవచ్చు కానీ, మెజార్టీ విషయంలో మాత్రం జగన్ చాలా నష్టపోతాడనే చెప్పవచ్చు.

## కాంగ్రెస్ మీదనే దాడి

ఈ ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీనే తన ప్రధాన శత్రువుగా లక్ష్యం చేసుకొన్నాడు జగన్. కాంగ్రెస్

కొరవ 14వ పేజీలో

## కార్టూన్ స్కేప్

ఎన్నికల ప్రచారంలో తొడ కొట్టిన కాంగ్రెస్ నేత

మీ తొడకొట్టడం ఏడ్చినట్టే వుంది... ఇంట్లో కాపడం పెట్టలేక నేను చస్తున్నా...!!

# అనర్హత అంత సులభం కాదు!

జగన్‌తో కలిసి వెళ్లిన ఎమ్మెల్యేలను పార్టీ ఫిరాయింపుల చట్టం క్రింద అనర్హులుగా ప్రకటించాలని ఢిల్లీ పెద్దలు చేసిన ఆజ్ఞను పాటించడం అంత సులభంగా కన్పించడం లేదు. కాంగ్రెస్, తెలుగుదేశం, ప్రజారాజ్యం పార్టీల నుంచి దాదాపు పాతిక మంది ఎమ్మెల్యేలు జగన్‌తో కలిసి వుంటున్నారు. ఈ ఫిరాయింపులకు మొదటగా శ్రీకారం చుట్టినవాడు నల్లపరెడ్డి ప్రసన్నకుమార్ రెడ్డి. వైఎస్ బ్రతికి వున్నప్పుడే ప్యాకేజ్ డీల్ మాట్లాడుకొని, పార్టీ ధిక్కార మార్గం అనుసరించాడు. అప్పటి నుంచి ఆయన్ను ఫిరాయింపుల చట్టం క్రింద పీకిపారేయాలని తెలుగుదేశం పార్టీ చేస్తున్న ప్రయత్నం సఫలం కావడం లేదు. ప్రసన్న పూర్వాశ్రమంలో, కిరణ్‌కుమార్ రెడ్డి స్నేహితుడు. నిజాం కాలేజీలో ఇద్దరూ కలిసి చదువుకొన్నారు. ఆ మొగమాటంతో స్పీకర్‌గా వున్నన్ని రోజులూ కాపాడాడు. ఇప్పుడు ఢిల్లీ పెద్దలు ఈ సానుకూల వైఖరిపై తీవ్ర అభ్యంతరం చెప్తున్నారు. ప్రసన్న విషయంలో అనుసరించిన అలుసు వల్లనే, తతిమా ఎమ్మెల్యేలు నిర్భయంగా జగన్ పక్షం చేరగలిగారని ఢిల్లీ పెద్దల ఆక్షేపణ.

దానితో మూడు పార్టీల ఫిరాయింపుదారుల పని పట్టాలని డిప్యూటీ స్పీకర్ నాదెండ్ల మనోహర్ నోటీసుల పర్వం మొదలెట్టాడు. కానీ వారిని అసెంబ్లీ నుంచి బహిష్కరించడం నోటీసులు ఇచ్చినంత సులభం కాదని పరిశీలకుల అభిప్రాయం. అసలు ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డికే అది ఇష్టం లేని పనిగా వుంది. ఎంతమంది మీద చర్య తీసుకొంటే అన్ని ఉపఎన్నికలు వచ్చి పడతాయి. అసలే అస్తుబిస్తుగా వున్న తన కుర్చీ క్రిందకు అవి నీళ్ల తెస్తాయన్నది ఆయన భయం. దానికంటే అధికంగా, ఉప ఎన్నికల ఖర్చు ఎవరు భరించాలన్నది సమస్య. కిరణ్‌కుమార్ రెడ్డి ఇప్పటివరకు ముఖ్యమంత్రిగా ఒక్క తప్పుడు పనీ చేయలేదు. ఎవరి నుంచీ ఒక్క రూపాయి ఆశించలేదు. కడప ఉప ఎన్నిక ఖర్చు కూడా ఢిల్లీ పెద్దలే భరిస్తున్నారు. తతిమా వాటికీ వారిని డబ్బు అడగలేదు. డబ్బు లేకుండా ఉప ఎన్నికలు అసాధ్యం. అందువల్ల సాధ్యమైనంత వరకు ఈ అనర్హత వివాదాన్ని అట్లనే నలగనివ్వాలని ఆలోచిస్తున్నాడట ముఖ్యమంత్రి. దానితో జగన్ పక్కన చేరిన ఎమ్మెల్యేలు తమ పదవుల మీద పూర్తి భరోసాతో వున్నారు.

# చేదు అనుభవం

హైదరాబాద్ పాతబస్తీకి చెందిన మజ్లిస్ పార్టీ ఎమ్మెల్యే అక్బరుద్దీన్ ఒవైసీపై జరిగిన హత్యా ప్రయత్నం అధికార దుర్వినియోగం చేసే ప్రతి రాజకీయవాదికీ ఒక చేదు గుణపాఠంగా భావించాలి. పాతబస్తీ రాజకీయాలలో మజ్లిస్ పార్టీ ప్రాభవం అప్రతిహతమైనది. గత యాభై ఏళ్లుగా ఆ ప్రాంతాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా పాలిస్తున్న పార్టీ అది. పాతబస్తీ ఇరుకు సందులలో తమ ఆజ్ఞ లేనిదే చీమైనా కుట్టడానికి లేదన్నది ఒవైసీ కుటుంబ విధానం. అక్కడ ప్రభుత్వమనేది వుండదు. ఒవైసీ కుటుంబం చెప్పిందే శాసనం. మంత్రులు, వున్నత పోలీసు అధికారులు సైతం పాతబస్తీకి వెళ్లాలంటే ముందుగా ఒవైసీల అనుమతి తీసుకొని వెళ్తారు. వైఎస్ క్యాబినెట్‌లో మంత్రిగా వుండిన షబ్బీర్ ఆలీ ఒకసారి వీరి అనుమతి లేకుండా పాతబస్తీలోని ఒక రేషన్ షాపు ఆకస్మిక తనిఖీకి వెళ్తే, మజ్లిస్ శాసనసభ్యులు అవమానించి వెనక్కు పంపారు. ఆ తర్వాత వైఎస్.రాజశేఖర్‌రెడ్డి, ముందు చెప్పకుండా ఎందుకు వెళ్లావని షబ్బీర్ అలీని మందలించాడట. పాతబస్తీలో ఒవైసీల నియంతృత్వ పోకడలకు ఇదొక చిన్న ఉదాహరణ మాత్రమే.

పిల్లి అయినా గదిలో పెట్టి హింసిస్తే పులి వలె తిరగబడుతుందని చెప్తారు. ఇప్పుడు అక్బరుద్దీన్ ఒవైసీ మీద జరిగిన హత్యాప్రయత్నం ఈ పోలికకు సరిపడేది కావడం గమనార్హం. తమను ధిక్కరించేవారిని, మాట వినని వారిని, ఎదుటి పార్టీతో చేతులు కలిపే వారిని అధికార బలం ఉపయోగించి అణిచి వేయాలని చూడడం ఇటీవల కొంతకాలంగా ఎమ్మెల్యేలు, మంత్రులకు ఆనవాయితీగా మారింది. రాజకీయ ప్రత్యర్థుల ఆస్తులు ధ్వంసం చేయడం, ఆర్థిక నష్టం కల్గించడం ఒక అలవాటుగా మారింది. అక్బరుద్దీన్‌ను చంపాలని ప్రయత్నం చేసిన మహమ్మద్ పహిల్వాన్, పాతబస్తీలో అంతో ఇంతో పలుకుబడి కల్గిన కుటుంబానికి చెందిన వాడు. నిజాం హయాంలో అరబ్ దేశాల నుంచి వలస వచ్చి ఇక్కడ స్థిరపడిన కుటుంబం వారిది. గతంలో వారంతా ఒవైసీ అనుచరులే. కానీ రెండేళ్ల క్రితం విభేదాలు వచ్చి మజ్లిస్‌కు ప్రత్యర్థులైన ఎంబిటి పార్టీలో చేరారట. అప్పటి నుంచి పహిల్వాన్ కుటుంబంపై ఒవైసీలు కక్ష కట్టారు. వారి ఆస్తులను, వ్యాపారాలను అది పనిగా దెబ్బ తీయడం ప్రారంభించారు. వారి కుటుంబానికి చెందిన పొలాలు, స్థలాలపైకి అధికారులను పంపి, వక్ఫ్ భూములనే నెపంతోనో, ప్రభుత్వ స్థలాలనే సాకుతోనో వివాదాలు సృష్టించేవారట. హత్యా ప్రయత్నం జరిగిన రోజు కూడా పహిల్వాన్ కుటుంబానికి చెందిన స్మశాన స్థలంలో ఒక వివాదం సృష్టించారు. వారి పశువులశాలలపైకి రెవిన్యూ అధికారులను పంపారు. దానితో కడుపు మండిపోయిన పహిల్వాన్ కుటుంబీకులు తిరగబడి ఇంత దారుణానికి ఒడికట్టారు. విచిత్రమేమిటంటే, ఇప్పటికీ దీన్ని తప్పుగా భావించడం లేదు వారు. తమ కుటుంబం ఎటూ సర్వనాశనమై పోతున్నది కాబట్టి, జైలుకు వెళ్లాల్సి రావడం తమకేమీ కష్టం కాదని నిబ్బరంగా చెప్తున్నారు.

అక్బరుద్దీన్ మీద అంత ఘోరమైన దాడి జరిగినా పాతబస్తీలో ప్రశాంతత కొనసాగడానికి కారణం మజ్లిస్ అరాచక, నియంతృత్వ వైఖరికి జనం విసుగు చెందడమే. రాజకీయ అధికారాన్ని, ప్రత్యర్థుల నాశనానికి దుర్వినియోగం చేయాలని చూసే రాజకీయవాదులందరికీ ఇదొక గుణపాఠం వంటిదనడం నిజం. రాష్ట్రంలో చాలా మంది అక్బరుద్దీన్‌లు వున్నారు. వైఎస్ ముఖ్యమంత్రి అయినప్పటి నుంచి కాంగ్రెస్ ఎమ్మెల్యేలు అధికార దుర్వినియోగం తమ హక్కుగా భావిస్తున్నారు. పోలీసు, రెవెన్యూ, మునిసిపల్ అధికారులను కిరాయి గూండాలుగా మార్చి ప్రత్యర్థులను హింసించే ప్రయత్నం చేస్తున్నారు. ఇళ్లు కూలగొట్టడం, ఆస్తులు స్వాధీనం చేసుకోవడం, రియల్ ఎస్టేట్ లే అవుట్‌లను ధ్వంసం చేయడం వంటి అకృత్యాలకు పాల్పడుతున్నారు. ప్రత్యర్థులను అణగదొక్కడానికి తామెంత గట్టి ప్రయత్నం చేస్తే, అంతకు రెట్టింపు బలంతో ప్రతికూలత విరుచుకపడుతుదన్న నిజాన్ని విస్మరిస్తున్నారు. అటువంటి అధికార మదాంధులందరికీ అక్బరుద్దీన్ ఉదంతం ఒక గుణపాఠం కావాలి.

## జనవాణి

### ఎఫ్ఎం రేడియో స్టేషన్ ఏమయ్యింది?

నెల్లూరు మహా నగరమయ్యింది. నగరంలో సంగీత ప్రియులు చాలా మంది వున్నారు. అన్ని వర్గాల వారిని ఆకట్టుకొనేది సంగీతమే. ప్రముఖ సినీ నేపథ్యగాయకుడు ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం నెల్లూరువాసి. ఎన్నో ప్రత్యేకతలున్న నెల్లూరు నగరంలో ఎఫ్ఎం రేడియో స్టేషన్ లేకపోవడం విచారకరం. ముప్పవరపు వెంకయ్య నాయుడు గారు కేంద్ర గ్రామీణాభివృద్ధి శాఖామంత్రిగా వున్నప్పుడు మంజూరు చేయించిన ఎఫ్ఎం రేడియో స్టేషన్ ఏమయ్యిందో ఇప్పటి నేతలు, అధికారులు సమాధానం చెప్పి తీరాలి.

*టి.కోటేశ్వరరావు* — కోవూరు

### సాయిబాబా ఆఫ్రికా వెళ్లారు!

ఏప్రెల్ 8తేది 'జమీన్‌రైతు' సంచికలోని మొదటి పేజీలో నడిచే దేవుడు కోలుకోవాలి శీర్షిక పేరిట వచ్చిన వార్తలో ఆయన తన జీవితంలో ఎప్పుడూ విదేశాలకు వెళ్లలేదని వ్రాశారు. కానీ ఒకసారి దక్షిణాఫ్రికాకు వెళ్లారు. ఏడు రోజులు అక్కడ వున్నట్లు పాత భక్తులకు మాత్రమే తెలుసు.

*ఎన్.మధుసూదనరావు* — హైదరాబాద్

### స్వామీజీలకు విన్నపం!

పుట్టపర్తి సాయిబాబా ఎన్నో మంచి పనులు చేశారు. మన రాష్ట్రంతో పాటు విదేశాలలోనూ విద్యాదానం, జనానికి మంచినీటి వసతులు కల్పించారు. బెంగుళూరు, పుట్టపర్తిలలో ఆయన కట్టించిన సూపర్ స్పెషాలిటీ ఆస్పత్రుల వల్ల లక్షల మందికి స్వస్థత చేకూరింది. ఇక్కడి విద్యాసంస్థల్లో చదివిన విద్యార్థులు ప్రపంచవ్యాప్తంగా వివిధ రంగాల్లో విస్తరించారు. సాయిబాబా చేతికి అందిన విరాళాలన్నీ సేవామార్గంలో మళ్లించి వేలకోట్లు మిగిల్చి వుండకుండా వుంటే స్వామికి అవసాన దశలో ఇన్ని ఇబ్బందులు వచ్చి వుండేవికావు. ఇప్పుడు చలామణిలో వున్న స్వామీజీలు కూడా తమకు అందే విరాళాలను సమాజ హితానికి వినియోగించమనవి. దానికిగాను పరమపూజ్యులు రామకృష్ణ పరమహంస, రమణ మహర్షి, అరవిందులు, శ్రీమాత అనుసరించిన మార్గమే శరణ్యం.

*టి.వెంకటకృష్ణారెడ్డి* — హైదరాబాద్

### అమరణ దీక్ష శక్తి చాటింది!

నిరాహార దీక్షలకు కాలం చెల్లిందని అనుకుంటే పొరపాటని జన్ లోక్‌పాల్ బిల్లును ప్రవేశపెట్టాలని అన్నా హజారే చేసిన నిరాహార దీక్ష రుజువు చేసింది. అన్నా హజారే దీక్ష దేశం మొత్తాన్ని ఒక కుదుపు కుదిపింది. ఆమరణ దీక్షకు ఎంత శక్తి వుందో మరోమారు తేటతెల్లం చేసింది. ఈ దీక్ష ఒక కులానికో,

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

**9-5-1941**
**పేజీలు : 12 వెల: అణా**

### పల్లెటూళ్ల సమస్యలు
### గూడూరు న్యూస్‌రీల్

జంగం వెంకటసుబ్బయ్యగారూ! పంచాయితీ బోర్డు తీట నీకెందుకు తగులు కున్నదయ్యా?

***

పొట్టేపాళెపు చెరువు చేపలు గత సంవత్సరం రూ.22లకు వేలం పాడితే ఈ సంవత్సరం తగ్గించి రూ.13లకే సిటీకరణం బ్రహ్మడు పాడాడట. ఎందువల్లనో? సన్నజనం పెరక్కతినే ఈనీచు కంపుమీద సనాతన బ్రాహ్మణీకానికి ఆధిపత్యం కావాలె కాబోలు! అబ్బే!!

### సైదాపురం పోలేరమ్మ

యుద్ధ టిక్కెట్ల హడావుడి నుంచి నిన్న నేడు బైటపడ్డ జనానికి పోలేరమ్మ జాతర చందాలొకటి కుతిక్కు తగులుకున్నవి.

–సిద్దారెడ్డి

హిట్లరు రాక్షసుడి జాతరతో వేగీ ఈదినాల్లో పోలేరమ్మ జాతర మానుకుంటే ఏం? బాంబుగుండ్లు, ట్యాంకులు లేవే ఆ ముండ దగ్గర భయపెట్టడానికి? ఓ చదువుకున్న ప్రెసిడెంటూ గారు! ఈ పిచ్చి జాతర్లతో ఇంకా ప్రొద్దుపుచ్చుతుంటారా? స్వాతంత్ర కృషికి దోహదమివ్వు.

### వాసిలి వార్షికోత్సవము

బోర్డు పాఠశాల వార్షికోత్సవం 4తేది ఉమామహేశ్వరరావు అధ్యక్షతన జయప్రదముగా జరిగినది. వెంకట్రమణయ్యగారు స్కూళ్ల శిక్షణాక్రమమున మిళితముకాని ఇతర విషయములను గూర్చి వుపన్యసించిరి.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

**5-5-1961**
**పేజీలు: 12 వెల: 0-20 న.పై**

### ప్రజల పేరుతో నియంతృత్వం

ప్రజలపేరుతో నియంతృత్వం నెలకొల్పుతున్నాడు క్యూబా అధిపతి కాస్ట్రో. తనది సోషలిస్టు రాజ్యమని, దేశంలో ఎన్నికలంటూ జరుపబోమని కాస్ట్రో ప్రకటించాడు. రష్యా శిష్యరికం జేసే రాజ్యంలో యింతకంటే ఎక్కువైన ప్రజాస్వామ్యాన్ని ఆశించలేము. కాని తాము నియంతృత్వపోకడలు అనుసరిస్తూ, యితరులను సామ్రాజ్యవాదుల క్రింద దూషించే వీరి వైఖరిని ప్రజాస్వామ్య ప్రపంచం ఎట్లా హర్షిస్తుందనుకుంటారో దురూహ్యం!

### తిరుపతిస్వామి ఆదాయం 116లక్షలు

కోటిన్నర రూపాయల శాశ్వత ధర్మాదాయ రిజర్వునిధిని ఏర్పాటు చేస్తూ ఈవారం సమావేశమైన తిరుమల తిరుపతి దేవస్థానముల ధర్మకర్తల బోర్డు తీర్మానించింది.

ఈ సమావేశంలోనే, దేవస్థానం ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు సి.అన్నారావుగారు ప్రవేశపెట్టిన 1961–62వ సంవత్సర బడ్జెటును ధర్మకర్తల సంఘం ఆమోదించింది. క్రితం ఏడాది మిగులుతోసహా ఈ ఆర్థిక సంవత్సర ఆదాయం 1కోటి16లక్షల 92వేలుగా బడ్జెట్‌లో చూపబడింది. దేవస్థానం బడ్జెట్‌లో లలితకళలకు, సంస్కృతీ వికాసానికి 1లక్ష; వజ్రాలతో శంఖుచక్రములను తయారు జేయించడానికి 8 1/2 లక్షలు; సత్రముల నిర్మాణానికి 20లక్షలు; గోగర్భం నీటిసరఫరా పథకాన్ని అమలు జరుపుటకు 20లక్షల 40వేలు; పారిశుధ్ధ్యపు పనివారికి 2లక్షల 21వేలు; తిరుమలకు రెండవ రోడ్డు వేయడానికి 2 లక్షలు; ఢిల్లీలో కళాశాల నెలకొల్పుటకు 3లక్షలు; బస్సులు కొనడానికి 12లక్షలు; సిబ్బంది గృహ నిర్మాణమునకు 3 1/2లక్షలు; మహల్ నిర్మాణానికి లక్ష రూపాయలు ఈబడ్జెట్‌లో కేటాయించబడి వున్నవి.

# నెల్లూరు ముచ్చట్లు

## నెల్లూరులో హైకోర్టు జడ్జి!

హైకోర్టు న్యాయమూర్తి సుభాష్ రెడ్డి 2వ తేది నెల్లూరు వచ్చారు. జిల్లా పోర్టుఫోలియో జడ్జి కూడా అయిన ఈయన జిల్లా కోర్టు ప్రాంగణం, కలెక్టరేట్ ప్రాంగణంలోని క్రిమినల్ కోర్టు, దర్గామిట్టలోని జడ్జీల క్వార్టర్లు సందర్శించారు. కోర్టు భవనాలన్నీ ఒకే ప్రాంగణంలో వుంటే బాగుంటుందన్న అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. సాయంత్రం బార్ అసోసియేషన్ వార్షికోత్సవంలో పాల్గొని ప్రసంగించారు. కక్షిదారులకు సత్వర న్యాయం అందాలంటే న్యాయస్థానాలు, న్యాయవాదుల సంఖ్య పెరగడంతోపాటు మౌలిక వసతులు కూడా ప్రభుత్వం కల్పించాలన్నారు. జిల్లాలోని న్యాయస్థానాల్లో 36,600 కేసులు పెండింగ్‌లో వుండడం పట్ల ఆవేదన వ్యక్తం చేశారు. జిల్లా జడ్జి ఎల్.శ్రీరామమూర్తి హైకోర్టు జడ్జి వెంట పర్యటించారు.

## తగ్గిన ఇంటర్ ఉత్తీర్ణతా శాతం!

గత ఏడాది కంటే ఈ ఏడాది జిల్లాలో ఇంటర్ ద్వితీయ సంవత్సరం ఉత్తీర్ణతా శాతం తగ్గింది. పరీక్షలకు 22,537 మంది విద్యార్థులు హాజరుకాగా వీరిలో 14,863 మంది ఉత్తీర్ణులయ్యారు. బాలికలు 9,744 మంది పరీక్ష వ్రాయగా 6,755 మంది పాసయ్యారు. బాలురు 12,793 మంది పరీక్ష వ్రాయగా 8,108 ఉత్తీర్ణులయ్యారు. గత ఏడాది 69 శాతం మంది ఉత్తీర్ణులు కావడం విశేషం.

నెల్లూరు నారాయణ విద్యా సంస్థల్లో ఎమ్పీసీ విభాగంలో చదివిన కె.శ్రీవాస్తవ, ఎస్.జ్యోత్స్న 985 మార్కులు తెచ్చుకొని జిల్లాలో టాపర్లుగా నిలిచారు. బైపిసి విభాగంలో రాగదీపిక, పి.లేఖశ్రీ 980 మార్కులు తెచ్చుకొన్నారు. కృష్ణచైతన్య జూనియర్ కాలేజిలో చదివిన ఎస్.పి.దిలీప్ ఎమ్పీసి విభాగంలో 981, ధీరజ్ 979, మనోజ్ 977 మార్కులు సాధించినట్లు సంస్థ డైరక్టర్ చంద్రశేఖర్ రెడ్డి తెలియజేశారు.

## జెండావీధిలో రౌడీమూకలు!

నెల్లూరు జెండావీధి, మన్సూర్ నగర్, ఖుద్దూస్ నగర్ ప్రాంతాల్లో రౌడీమూకల అరాచకాలకు పోలీసులు అడ్డుకట్ట వేయలేక పోతున్నారు. 1వ తేది చాంద్ బాష అనే రౌడీషీటర్ తన ఇద్దరు అనుచరులతో కలిసి జెండావీధిలో ఒక కారు అద్దాలు పగులగొట్టాడు. మన్సూర్ నగర్‌లో ఒక ఇంట్లో ద్విచక్ర వాహనం బయటకు తెచ్చి తగులబెట్టాడు. ఖుద్దూస్ నగర్‌లో ఒక ఆటో, ద్విచక్ర వాహనం తగుల బెట్టడం సంచలనం సృష్టించింది. పీకల దాకా తాగి రౌడీమూకలు ఈ అరాచకాలు చేస్తుంటే జెండావీధి పరిసర ప్రాంతీయులంతా గమ్మునుండి పోవడం విస్మయం కల్గించింది. వన్‌టౌన్ ఎస్ఐ మాటలే కాదు పనితనం కూడా చూపాల్సిన అవసరం ఎంతైనా వుందని ఈ సంఘటనలు చాటి చెబుతున్నాయి.

## ఇంటర్ విద్యార్థి ఆత్మహత్య!

ఇంటర్ ఫలితాల్లో తక్కువ మార్కులు వచ్చాయన్న ఆవేదనతో నెల్లూరు రామలింగాపురం మినీ బైపాసు రోడ్డులోని శ్రీ అపార్ట్‌మెంట్‌లో నివసించే హర్ష ప్రతాప్ ఇంట్లో ఉరి వేసుకొని చనిపోయాడు. ఈ విద్యార్థి వెయ్యికి 970 మార్కులు వస్తాయని భావించాడు. కానీ 927 మార్కులు రావడంతో బాధను తట్టుకోలేక ఆత్మహత్య చేసుకొన్నాడు.

## కలెక్టర్‌కు ఫిర్యాదు

నెల్లూరులోని సమాచార హక్కు – సామాజిక పర్యవేక్షణ సమితి ఏప్రెల్ 29వ తేది జిల్లా కలెక్టర్ శ్రీధర్‌ను కలిసి అభినందనలు తెలియజేసింది. అనంతరం పెద్దాసుపత్రికి ఎదురుగా నిర్మించిన సత్రానికి సంవత్సరానికి రూపాయి బాడుగ ఇస్తూ ప్రగతి మహా విద్యాలయం ఇంగ్లీషు మీడియం స్కూల్ నడపడాన్ని ఆయన దృష్టికి తీసుకొచ్చింది. దీని వల్ల రోగులకు సహాయకులుగా వచ్చిన వారు చెట్ల కింద వండుకొని తిని పడుకోవాల్సి వస్తుందని తెలియజేశారు. కలెక్టర్ జోక్యం చేసుకొని ఈ స్కూల్‌ను ఖాళీ చేయించాలని కోరారు. కలెక్టర్‌ను కలిసిన వారిలో సమితి నాయకులు దామా చెంచయ్య, చల్లా యానాదయ్య, గొరినేని వెంకయ్య, వాస్తు రామచంద్ర, బి.రామిరెడ్డి, అంజయ్యనాయుడు, అరుణాచలం తదితరులున్నారు.

## మళ్లీ చోరీ

నెల్లూరు నగరంలో జనాన్ని మాయ చేసి చోరీచేసే ఘటనలు ఆగడం లేదు. మనుబోలు మండలం రాజోలుపాడుకు చెందిన కె.కోటేశ్వరమ్మ తన కుమార్తె వివాహ నిమిత్తం నగలు కొనడానికి ఏప్రెల్ 28వ తేది లక్షా 70వేల రూపాయలు తీసుకొని నగరానికి వచ్చింది. కొరడా వీధిలో 52వేల రూపాయలతో బంగారు వస్తువులు కొనుగోలు చేసి మిగిలిన మొత్తం లక్షా 18వేలతో కలిపి ఒక బ్యాగులో పెట్టింది. కాస్త ముందుకొచ్చి చూసేసరికి ఆమె బ్యాగు కోతకు గురైన విషయం పరిచయస్తుడు ఎదురుపడి చెప్పేవరకు తెలియలేదు. దీంతో లబోదిబోమంటూ మూడవ పట్టణ పోలీసులను ఆశ్రయించింది. బ్యాగులు కోసి లక్షలకు లక్షలు పట్టుకెళ్లే ముఠాలు నెల్లూరులోనే తిష్టవేసి వున్నాయి. కానీ వీరిని పట్టే పోలీసులే లేకుండా పోయారు. దొంగతనాల విషయంలో పోలీసులు, దొంగలకు మంచి అవగాహన వున్నదనే విమర్శ కూడా వుంది.

## వివాదాస్పద ఎస్ఐకు ప్రమోషన్

పోలీసు శాఖలో వివాదాస్పదుడు ఈస్ట్‌జోన్ ట్రాఫిక్ ఎస్ఐ వెంకటేశ్వర్లుకు ఎట్టకేలకు సిఐగా ప్రమోషన్ లభించింది. పోస్టింగ్ కోసం తన వద్ద రిపోర్ట్ చేసుకోమని గుంటూరు రేంజ్ ఐజి హరీష్‌కుమార్ గుప్తా ఆదేశించారు.

## ట్రైనీ డిఎస్పీ!

నెల్లూరు రూరల్ ట్రైనీ డిఎస్పీగా లక్ష్మీనారాయణ 2వ తేది బాధ్యతలు స్వీకరించారు. ఈయన ఆళ్లగడ్డ వాసి. గ్రూప్ వన్ పరీక్ష ద్వారా డిఎస్పీగా ఎంపికైన లక్ష్మీనారాయణ ఆరు నెలలపాటు నెల్లూరులో శిక్షణ తీసుకొంటారు.

## రజక సమాఖ్య

జిల్లా రజక సమాఖ్య నూతన కార్యవర్గ ఎన్నిక 30వ తేది స్టోన్‌హౌస్‌పేటలోని జిల్లా కార్యాలయంలో జరిగింది. అధ్యక్షునిగా వింజమూరు మస్తాన్ బాబు, ఉపాధ్యక్షులుగా ఎల్వీ సుబ్బయ్య, జలదంకి మాల్యాద్రి, మన్నూరు శ్రీనివాసులు, ఎల్లంటి చెంచయ్య, తంగెళ్లపల్లి మస్తానయ్య, ప్రధాన కార్యదర్శిగా చిలకపాటి రామాంజనేయులు, కోశాధికారిగా పాతపాటి వీరరాఘవులు, మహిళా

కొరవ 14వ పేజీలో

## సెలవుల్లోనూ తరగతులు

• కార్పొరేట్ విద్యా సంస్థల తీరిది

కార్పొరేట్ విద్యాసంస్థలు వేసవి సెలవుల్లోనూ తరగతులను ప్రారంభించాయి. ఇంటర్మీడియట్ బోర్డు అధికారులు సెలవుల్లో తరగతులను నిర్వహించరాదని, ఎవరైనా దీనిని అధిగమిస్తే కఠిన చర్యలు తీసుకొంటామని ఎప్పుడూ పాడినట్లు పాత పాటే పాడుతున్నా ఏ ఒక్కరూ దీనిని ఖాతరు చేయడం లేదు. పాఠశాలలు, కళాశాలలకు వేసవి సెలవులను ప్రకటించక ముందే పలు విద్యాసంస్థలు పై తరగతులను ప్రారంభించాయి. దీనికి సంబంధించి విద్యార్థులకు అవసరమైన పాఠ్య పుస్తకాల దగ్గర్నుంచి ఫీజులు, తరగతులు అన్నీ మొదలయ్యాయి. రెగ్యులర్‌గా తరగతులకు హాజరైనట్లే వివిధ క్లాసుల విద్యార్థులు పాఠశాలలు, కళాశాలలకు హాజరవుతున్నారు. విద్యార్థులకు విద్యా బోధనతోపాటు క్రీడల్లోనూ ప్రవేశం వుండాలని, అప్పుడే మానసికంగా, శారీరకంగా ఎదుగుదల వుండి పూర్తిస్థాయిలో రాణించగలుగుతారని మేధావులు, నిపుణులు చెప్తున్నా అదెక్కడా పాటించబడదం లేదు. ముఖ్యంగా ఇంటర్మీడియట్ కళాశాలలు ఇష్టానుసారంగా వ్యవహరిస్తున్నా సంబంధిత అధికారులు ప్రకటనలకు మాత్రమే పరిమితం అవుతున్నారు తప్ప నిబంధనలు అతిక్రమించే కళాశాలలపై చర్యలు చేపట్టలేకపోవడంతో విద్యార్థులకు వేసవి సెలవులు వుండడం లేదు.

• హాస్టళ్లకు

## పౌరసరఫరాలశాఖ సరకులు

జిల్లాలో నడుస్తున్న ప్రభుత్వ హాస్టళ్లకు ఈ సంవత్సరం నుంచి పౌరసరఫరాల శాఖ నుంచి సరుకులు సరఫరా కానున్నాయి. ప్రైవేట్ వ్యక్తులు, సంస్థలు హాస్టళ్లకు అవసరమైన వివిధ రకాల సరుకులను ఇప్పటివరకు సరఫరా చేసేవి. ఇలా చేయడం వల్ల కొన్ని అక్రమాలు చోటుచేసుకొంటుండడంతో ప్రభుత్వం పౌరసరఫరాల శాఖ ద్వారా సరుకులు సరఫరా చేయాలని నిర్ణయించింది. బాల

### కొత్త నిర్ణయం

బాలికలకు అవసరమైన సబ్బులు, కాస్మొటిక్‌లతోపాటు నిత్యావసర వస్తువులను సరఫరా చేస్తారు. ఇందుకు అవసరమైన నిధులను ఆయా శాఖలు నేరుగా పౌరసరఫరాల శాఖకు చెల్లిస్తాయని ప్రభుత్వం పేర్కొంది. సరుకుల విషయంలో నాణ్యతా ప్రమాణాలు పాటించడంతోపాటు వార్డెన్ల అక్రమాలకు బ్రేకువేసే అవకాశం ఏర్పడింది. ప్రభుత్వం తీసుకొన్న కొత్త నిర్ణయం వల్ల నాణ్యమైన సరుకులు హాస్టళ్లకు చేరే అవకాశం వుంది. నాసిరకం నిత్యావసరాలతో వండిన ఆహారం తిని విద్యార్థులు ఎన్నో సమస్యలు ఎదుర్కొంటున్నారు. హాస్టళ్లు జూన్‌లో పునః ప్రారంభమైన తరువాత ఈ ప్రక్రియ కొనసాగుతుంది. దీన్ని సక్రమంగా కొనసాగించాల్సి వుంది.

# దడ పుట్టిస్తున్న ఎరువుల ధరలు


ఎరువుల కొనడం ఇక కష్టమే.

### ఒక్కసారిగా పెంచిన కంపెనీలు

ప్రకృతి ప్రకోపం, తెగుళ్లు, గిట్టుబాటు ధర లేక తీవ్రంగా నష్టపోతున్న రైతాంగాన్ని పెరిగిన ఎరువుల ధరలు దడ పుట్టిస్తున్నాయి. ప్రముఖ కంపెనీలు ఎరువుల ధరలను అమాంతంగా పెంచడంతో రైతులపై అదనపు భారం పడుతోంది. స్పిక్, ఇఫ్కో కంపెనీలు ఒక్క బస్తాపై 90 రూపాయల మేర ధర పెంచడంతో రైతులు ఆ భారం మోయలేక పోతున్నారు. ఖరీఫ్ సీజన్‌లో దాదాపు రెండు లక్షల ఎకరాల్లో వరి సాగవుతోంది. దీనికి లక్ష టన్నుల ఎరువులు వాడుతారు. 30వేల టన్నుల యూరియా, 15వేల టన్నుల డిఏపి, 30వేల టన్నుల కాంప్లెక్స్ ఎరువులు, 15వేల టన్నుల పొటాష్ ఇతరత్రా పదివేల టన్నులు వినియోగిస్తారని అధికారులు చెప్తున్నారు. ఈ పరిస్థితుల్లో కేంద్ర ప్రభుత్వం ఎరువుల ధరలు పెంచుకొనేందుకు ఆయా కంపెనీలకు అనుమతినివ్వడంతో వాటి ఇష్టానుసారంగా ధరలు పెంచేశాయి. దీంతో రైతులు పెరిగిన ఎరువుల ధరతో దిగాలు చెందుతున్నారు. అసలే పలు రకాల కారణాలతో దిగుబడి తగ్గి తీవ్రంగా నష్టపోతున్న రైతాంగాన్ని పెరిగిన ఎరువుల ధరలు మరింతగా క్రుంగదీస్తున్నాయని రైతు సంఘాల నేతలు అభిప్రాయ పడుతున్నారు.

# పారిశుద్ధ్యం పాతర

• విజృంభిస్తున్న వ్యాధులు



సంతపేట ప్రాంతంలో పేరుకపోయిన చెత్తాచెదారం.

నగరంలో పారిశుద్ధ్యం పరిస్థితి మెరుగుపరచేందుకు అన్ని చర్యలు చేపడుతున్నామని మునిసిపల్ అధికారులు, ప్రజాప్రతినిధులు ప్రకటిస్తున్నా అవి ఎక్కడా ఆచరణ రూపం దాల్చడం లేదన్నది నగరంలో ఏ ప్రాంతాన్ని పరిశీలించినా అవగతమవుతుంది. ఎక్కడ చూసినా చెత్త కుప్పలు దర్శనమిస్తున్నాయి. కొన్ని ప్రాంతాల్లో మునిసిపల్ సిబ్బంది చెత్తను తొలగిస్తున్నా అధిక ప్రాంతాల్లో మాత్రం చెత్త పేరుకపోతోంది. దీనికితోడు సైడు కాలువలలో పూడికతీయక పోవడంతో మురుగునీటి పారుదల నిలిచిపోయి రోడ్లపైకి మురుగునీరు పొంగి ప్రవహించి దుర్వాసన వెదజల్లుతుండడంతో నగర వాసులు తీవ్ర ఇబ్బందుల నడుమ జీవనం సాగించాల్సి వస్తోంది. చాకలివీధి, పొగతోట, మైపాడుగేటు, జ్యోతినగర్, వేదాయపాళెం తదితర ప్రాంతాల్లో పారిశుద్ధ్యం క్షీణిస్తున్నా అధికారులు పట్టించుకొన్న దాఖలాలు లేవని స్థానికులు వాపోతున్నారు. వీటికితోడు కలుషిత నీరు ప్రజలను అనారోగ్యం పాల్చేస్తుంది. మంచినీటి సరఫరా విషయంలో పరిశుభ్రత పాటించకపోవడంతో కలుషిత నీరు మంచినీటి పైపులైన్లలో కలిసి వస్తుండడంతో నీటి ఎద్దడి నెలకొన్న పరిస్థితులలో ప్రజలు తప్పనిసరై రంగుమారిన నీటిని పట్టుకొని త్రాగాల్సి వస్తుంది. ఇక వీధి దీపాలు చాలా చోట్ల వెలగక పోవడంతో చిమ్మచీకట్లు అలుముకొంటున్నాయి. అసలే దొంగతనాలు అధికం అవుతున్న పరిస్థితుల్లో వీధి దీపాలు లేకపోవడంతో ప్రజలు రాత్రి సమయంలో వీధుల్లో తిరగాలంటేనే హడలి పోతున్నారు. కార్పొరేటర్ల మాజీలు కావడంతో ప్రజలు ఈ సమస్యలను తెలిపినా వారు పట్టించుకోవడం లేదు. మునిసిపల్ అధికారులకు చెప్పాలని చెప్పుండడంతో నగర వాసులు సమస్యలతో సహజీవనం చేయాల్సి వస్తోంది.

• నిధులు విడుదల చేయని ప్రభుత్వం

## కునారిల్లుతున్న పంచాయితీలు

జిల్లాలోని పలు గ్రామ పంచాయితీల పరిస్థితి అధ్వాన్నంగా మారింది. ప్రభుత్వం నుంచి అవసరమైన నిధులు విడుదల కాకపోవడంతో అభివృద్ధి పనులు నిలిచిపోయాయి. వేసవికాలం సమీపించడంతో తాగునీటి సమస్య ఏర్పడింది. మోటర్లు మరమ్మత్తులకు గురి కావడం, పైపులైన్లు లీకేజి కావడం వంటి సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి. వీటికితోడు పారిశుద్ధ్యం కూడా తోడయ్యింది. ఈ క్రమంలో నిధులు రాకపోవడంతో పంచాయితీ సర్పంచ్‌లు, కార్యదర్శులు దిక్కుతోచని స్థితిలో వున్నారు. రిజిస్ట్రేషన్లు, లే


నిధులు విదిల్చని జిల్లా పంచాయతీ కార్యాలయం.

అవుట్ల నుంచి సెస్సుల రూపంలో గ్రామ పంచాయితీలకు కొంత వాటాగా నిధులు జమ కావాల్సి వుంటుంది. ఇవి కూడా పంచాయితీ ఖాతాలకు జమ కాకపోవడంతో సిబ్బంది జీతాలకు తీవ్ర కొరత ఏర్పడింది. మేజర్ పంచాయితీలు ఇంటి పన్నుల వసూళ్లతో కొంత నెట్టుకొస్తున్నా, చిన్న పంచాయితీలు ఆర్థిక ఇబ్బందులతో సతమతమవుతున్నాయి. ఇప్పటికైనా గ్రామ పంచాయితీలకు నిధులు విడుదలచేసి అభివృద్ధికి సహకరించాలని పంచాయితీ సర్పంచ్‌లు కోరుతున్నారు.

# జలయజ్ఞం ప్రాజెక్ట్ పనులపై దృష్టి?


పెన్నా బ్యారేజీ వద్ద ఊపందుకున్న పని.

జిల్లాలో జలయజ్ఞం పేరుతో చేపట్టిన సాగునీటి ప్రాజెక్టులపై నీటి పారుదల శాఖ అధికారులు ప్రత్యేక దృష్టి సారించారు. పనులు ప్రారంభించి మధ్యలో నిలచిపోయిన ప్రాజెక్టుల వివరాలు, తర్వితగతిన పూర్తి చేయాల్సిన ప్రాజెక్టుల వివరాలు సేకరించడంలో నిమగ్నమయ్యారు. రాష్ట్ర ప్రభుత్వ ఆర్థిక పరిస్థితి బాగాలేనందున సాగునీటి ప్రాజెక్టులను పూర్తి చేయలేక పోతున్నారు. ఇటీవల వివిధ విభాగాల చీఫ్ ఇంజినీర్లు ప్రాజెక్టుల నిర్మాణ పనులపై సమగ్ర నివేదిక సమర్పించడం జరిగింది. నిధుల కొరత కారణంగా పనులు పూర్తికాక పోవడంతో రైతులు, ప్రభుత్వం ఇబ్బంది పడక తప్పడం లేదు. నిర్మాణ పనులు ప్రారంభించి చివరిదశకు చేరిన ప్రాజెక్టులను పూర్తి చేసేందుకు తొలి ప్రాధాన్యత ఇవ్వాలని ఇంజనీర్లు సూచించారు. దీంతో మన జిల్లాలో కూడా నీటి పారుదల శాఖ ఆధ్వర్యంలో చేపట్టిన పనులు ఏ దశకు చేరుకున్నాయన్న సమాచారాన్ని అందించాలని కోరడంతో అందుకు సంబంధించిన జాబితాను రూపొందిస్తున్నారు. సంగం బ్యారేజ్, పెన్నా బ్యారేజ్ నిర్మాణ పనులు మినహా ఇతర నిర్మాణ పనులు పూర్తి చేయించేందుకు ప్రభుత్వం నిధులు విడుదల చేసే అవకాశమున్నట్లు అధికారులు చెబుతున్నారు.

# ఫీజు రీయింబర్స్‌మెంట్ హుళక్కేనా?

**2010 - 2011 ఆర్థిక సంవత్సరంలో ఫీజు రీయింబర్స్‌మెంట్‌కు జిల్లాలో 23,618 మంది విద్యార్థులు దరఖాస్తు చేశారు. వీరికి 22కోట్ల 9లక్షల 9వేల 789 రూపాయలు అవసరం కాగా, రాష్ట్ర ప్రభుత్వం కేవలం 14కోట్ల 3లక్షలా 21వేల 202 రూపాయలు విడుదల చేసి చేతులు దులుపుకొంది.**

జిల్లాలో ఎస్సీ, ఎస్టీ, బిసి, మైనార్టీ విద్యార్థులకు ఫీజు రీఎంబర్స్‌మెంటు, స్కాలర్‌షిప్పుల నిధుల విడుదలపై ఆశలు సన్నగిల్లుతున్నాయి. విద్యాసంవత్సరం ముగిసినప్పటికీ స్కాలర్‌షిప్పుల నిధులు పూర్తిగా ప్రభుత్వం విడుదల చేయలేకపోయింది. మరో నెల రోజులో తిరిగి విద్యాసంవత్సరం పున:ప్రారంభమవుతుంది. అప్పటికి కూడా ప్రభుత్వం నుంచి ఫీజులు వచ్చే అవకాశం కనిపించడం లేదు. కళాశాలల యాజమాన్యాలు పలు దఫాలుగా ప్రభుత్వంతో చర్చలు జరిపాయి. చర్చల సందర్భంగా బకాయిలు చెల్లించడంతోపాటు 2010 – 11 విద్యాసంవత్సరానికి సంబంధించి ఫీజు రీఎంబర్స్‌మెంటు విడుదల చేస్తామని హామీ ఇవ్వడం జరిగింది.

అయితే ప్రభుత్వం ఇచ్చిన హామీని మాత్రం నిలుపుకోలేకపోయింది. 2009–10 సంవత్సరంలో ఫీజు రీఎంబర్స్‌మెంటు క్రింద 21,251 మంది విద్యార్థులు దరఖాస్తు చేసుకొన్నారు. వీరిలో 12,128 మంది రెన్యువల్ విద్యార్థులు కాగా సాధారణ విద్యార్థులు 9,123 మంది వున్నారు. వీరికి 21కోట్ల 85 లక్షల 6వేల 150రూపాయలు అవసరం కాగా రాష్ట్రప్రభుత్వం 8కోట్ల, 17లక్షల 16వేల 352రూపాయలు విడుదల చేసింది. ఇంకా 13 కోట్ల రూపాయలు ఫీజు రీఎంబర్స్‌మెంటుకు అవసరం అవుతాయి. 2010–11 సంవత్సరంలో ఫీజు రీఎంబర్స్‌మెంటుకు 23,618 మంది విద్యార్థులు దరఖాస్తు చేశారు. వీరికి 22కోట్ల 9లక్షల 9వేల 789రూపాయలు అవసరం అవుతాయి.

రాష్ట్రప్రభుత్వం మాత్రం కేవలం 14కోట్ల, 3లక్షల, 21వేల 202 రూపాయలు విడుదల చేసి చేతులు దులుపుకొంది. ఇంకా 8కోట్లకు పైగా నిధులు విడుదల కావాల్సి వుంది. సాంఘిక సంక్షేమశాఖలో 2009–10, 2010–11 సంవత్సరాలకు కలిపి మొత్తం 20కోట్లకుపైగా బకాయిలు పేరుకుపోయి వున్నాయి. ఇన్ని కోట్ల రూపాయలు ప్రస్తుత పరిస్థితుల్లో ప్రభుత్వం విడుదల చేయడం కష్టతరమని మంత్రులే చెబుతున్నారు.

## బి.సి వెల్ఫేర్

సాంఘిక సంక్షేమశాఖ పరిస్థితి పైవిధంగా వుంటే వెనుకబడిన తరగతుల సంక్షేమశాఖ పరిస్థితి మరింత దారుణంగా తయారైంది. ఈశాఖకు ఫీజు రీఎంబర్స్‌మెంటు కోసం 35,689 మంది దరఖాస్తు చేసుకోగా సంబంధిత అధికారులు సక్రమంగా పరిశీలన చేయడంలో పూర్తిగా వైఫల్యం చెందారు. అధికారుల నిర్లక్ష్యం కారణంగా విద్యార్థుల దరఖాస్తులు నేటికీ పెండింగ్‌లో వున్నాయి. బి.సి, ఇబిసి విద్యార్థులకు సంబంధించి ఉపకారవేతనాలు, ఫీజు రీఎంబర్స్‌మెంటుకు దాదాపు 67కోట్ల రూపాయలు ప్రభుత్వం విడుదల చేయాలని ప్రతిపాదనలు వెళ్లాయి. అయితే 2010–11 సంవత్సరానికి సంబంధించి ప్రభుత్వం 22కోట్ల రూపాయలు విడుదల చేసింది. ఇందులో కూడా 5కోట్ల వరకు ఫ్రీజింగ్ విధించారు.

ప్రభుత్వం నుంచి 52కోట్ల రూపాయలు ఈశాఖకు అందాల్సి వుంది. ప్రధానంగా ఇంజినీరింగ్, మెడికల్ కళాశాలలు, డిగ్రీ కళాశాలలకు ఫీజు రీఎంబర్స్‌మెంటు నిధులు జమచేయాల్సి వుంది. ఇన్ని కోట్ల రూపాయల నిధులు పెండింగ్‌లో వుండడంతో వచ్చే విద్యాసంవత్సరానికి సంబంధిత కళాశాల యాజమాన్యాలు ప్రవేశం పొందే సమయంలోనే ఫీజులు వసూలు చేయాలని నిర్ణయించాయి. గిరిజన సంక్షేమ శాఖ, మైనార్టీ సంక్షేమశాఖలకు మాత్రం ఫీజులు, ఉపకారవేతనాలు మంజూరు కాబడ్డాయి. ఇప్పటికైనా ప్రభుత్వం స్పందించి విద్యాసంవత్సరం పున:ప్రారంభమయ్యే నాటికి ఫీజు రీఎంబర్స్‌మెంటు, ఉపకారవేతనాలు విడుదల చేస్తుందో లేదో వేచి చూడాలి. J

# జిల్లాలో ఇన్‌ఛార్జీల పాలన!

**జిల్లాలో అత్యంత ముఖ్యమైన కార్యాలయం జిల్లా పరిషత్‌కు సిఇఓ లేదు. ఎస్సీ కార్పొరేషన్, జిల్లా నీటి యాజమాన్య సంస్థ, సెట్నల్ శాఖలతోపాటు పలు మండలాల్లో తహశీల్దార్లు, ఎమ్పీడిఓల పోస్టులలో ఇన్‌ఛార్జీలు కొనసాగుతున్నారు.**

జిల్లాలోని పలు పరిపాలన విభాగాల్లో ఇన్‌ఛార్జీల పాలన కొనసాగుతుంది. వివిధ ప్రభుత్వశాఖల్లో కీలక నిర్ణయాలు తీసుకోవాల్సిన జిల్లాస్థాయి అధికారుల నియామకం జరగకపోవడంతో ఆయాశాఖల్లో చేపట్టాల్సిన పనులు, కార్యక్రమాలు నత్తనడకన నడుస్తున్నాయి. కీలక బాధ్యతలు నిర్వహిస్తున్న అధికారులను ఇతర ప్రాంతాలకు ప్రభుత్వం బదలీ చేసింది. అయితే బదలీపై వెళ్లిన వారి స్థానాల్లో కొత్తవారిని నియమించడంలో ప్రభుత్వం సరైన నిర్ణయం తీసుకోలేకపోతుంది. దీంతో ఇతరశాఖల్లో వున్న అధికారులకు ఇన్‌ఛార్జీ బాధ్యతలు అప్పగించాల్సిన పరిస్థితి ఏర్పడింది.

రెండు శాఖల పనితీరును పర్యవేక్షించాల్సి రావడంతో ఇన్‌ఛార్జీలుగా వ్యవహరించే అధికారులు కొన్ని ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. జిల్లాలో ప్రధానశాఖలైన జిల్లాపరిషత్, ఎస్సీ కార్పొరేషన్, జిల్లా నీటి యాజమాన్య సంస్థ, సెట్నెల్‌శాఖలతోపాటు పలు మండలాల్లో తహశీల్దార్లు, ఎంపీడిఓల పోస్టులు ఖాళీగా వున్నాయి. పై శాఖలకు ప్రస్తుతం ఇన్‌ఛార్జీలు బాధ్యతలు నిర్వహిస్తున్నారు. జిల్లాపరిషత్ సిఇఓగా ఉన్న రామిరెడ్డిని డ్వామా పిడిగా బదలీ చేసినప్పటికీ ఇక్కడ ఇన్‌ఛార్జీగానే కొనసాగేవారు. ప్రస్తుతం ఆయన జిల్లా రెవెన్యూ అధికారిగా బాధ్యతలు స్వీకరించిన సంగతి అందరికి తెలిసిందే. డ్వామా బాధ్యతలు కార్యాలయంలో ఎ.పి.డి.గా వున్న అధికారికి అప్పగించారు.

మొన్నటి వరకు డిఆర్వోగా వున్న జయరామయ్యను జడ్పీ సిఇఓగా ప్రభుత్వం నియమించిందన్న ప్రచారం జరిగినా చివరకు ఆయనకు ఎక్కడా పోస్టింగ్ ఇవ్వలేదు. దీంతో డిఆర్వోగా నియమితుడైన రామిరెడ్డి ప్రస్తుతం జడ్పీ ఇన్‌ఛార్జీ సిఇఓగా కూడా కొనసాగాల్సి వచ్చింది. అలాగే జిల్లా ఎస్సీ కార్పొరేషన్ ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్‌గా వున్న నాగలక్ష్మిని ప్రభుత్వం నాలుగు నెలల క్రితం బదలీ చేసింది. ఈమె స్థానంలో కొత్త వారిని నియమించకపోవడంతో అర్బన్ ఇందిరక్రాంతి పథం ప్రాజెక్టు డైరెక్టర్ డాక్టర్ సోమయ్యకు ఇన్‌ఛార్జీ బాధ్యతలు అప్పగించారు. పట్టణ ఐకెపి, ఎస్సీ కార్పొరేషన్ రెండు శాఖల ద్వారా పలు సంక్షేమ పథకాలు, బ్యాంకు లింకేజీ రుణాలు అందించాల్సి వుంటుంది.

ఎస్సీ కార్పొరేషన్ కార్యాలయంలో సిబ్బంది కొరత, నిధుల కొరత వుండడంతో పలు సంక్షేమ పథకాలు ముందుకు సాగడం లేదు. మరో ప్రక్క పట్టణ ఐ.కె.పి పరిధిలో నెల్లూరు మునిసిపల్ కార్పొరేషన్‌తోపాటు కావలి, గూడూరు, వెంకటగిరి మునిసిపాల్టీలు కూడా వున్నాయి. ఈ పట్టణాల్లో పొదుపు గ్రూపుల పనితీరు, సిబ్బంది పర్యవేక్షణ చేయడంతోపాటు ఎస్సీ కార్పొరేషన్ కార్యక్రమాలను అమలు చేయాల్సి వుంటుంది. లబ్దిదారుల నుంచి నిధులు మంజూరు కోసం వేలల్లో దరఖాస్తులు అందుతున్నా అందరికి పథకాలు మంజూరు చేయడం వీలుపడడం లేదు. సెట్నెల్‌కు జిల్లా బిసి కార్పొరేషన్ ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ కోటేశ్వరరావు ఇన్‌ఛార్జీగా వ్యవహరిస్తున్నారు.

ఈ రెండుశాఖలతోపాటు నేషనల్ చైల్డ్‌లేబర్ ప్రాజెక్టుకు కూడా ఆయన ఇన్‌ఛార్జీగా వున్నారు. కార్యాలయాల పనితీరు, ప్రభుత్వ కార్యక్రమాల పర్యవేక్షణ, ఉన్నతాధికారులు నిర్వహించే సభలు, సమావేశాలకు హాజరు కావాల్సి రావడంతో సతమతమవుతున్నారు. పైమూడు శాఖలకు నిధుల కొరత తీవ్రంగా వుంది. నిధులు లేని శాఖలకు చురుకైన అధికారులను ఇన్‌ఛార్జీలుగా నియమించడంతో ఏం చేయలేకపోతున్నారు. ఇప్పటికైనా ప్రభుత్వం స్పందించి సంక్షేమ పథకాలను కేటాయించడంతోపాటు పూర్తి బాధ్యతలు చూసే అధికారులను నియమించాల్సిన అవసరం ఎంతైనా వుంది. J



కొత్త కలెక్టర్‌ను కలసిన సమాచార హక్కు, సామాజిక పర్యవేక్షణ సమితి సభ్యులు దామా చెంచయ్య, రామిరెడ్డి, చల్లా యానాదయ్య, సివి.రమణయ్య, ప్రభాకర్, శశిధర్, అరుణాచలం, అంజయ్య, శివరామయ్య.




నెల్లూరు సామ్రాట్ క్లినిక్‌లో మేడే సందర్భంగా 'సృజన' సాహితీ సాంస్కృతిక వేదిక ఆధ్వర్యంలో జరిగిన కవి సమ్మేళనంలో మాట్లాడుతున్న ఫ్లయింగ్ స్క్వాడ్ సిఐ కారసాల ప్రసాదరావు. వేదికపై డాక్టర్ రామలింగేశ్వరరావు, డాక్టర్ యం.సుధాకర్ తదితరులు.




మేడే సందర్భంగా నెల్లూరులో ప్రదర్శన చేస్తున్న సిపిఎం పార్టీ కార్యకర్తలు.



నెల్లూరు సండే మార్కెట్‌లో ఇరు వర్గాల ఘర్షణ నేపథ్యంలో కిషోర్‌బాబు వర్గీయులు కలెక్టరేట్ వద్ద ధర్నా చేస్తున్న దృశ్యం.

● స్తబ్దుగా

# ఆత్మకూరు రాజకీయం!

## మూడు పార్టీలదీ అదే దారి

ఆత్మకూరు నియోజకవర్గంలో రాజకీయాలు విచిత్రంగా వున్నాయి. అధికార కాంగ్రెస్‌పార్టీ, ప్రతిపక్ష తెలుగుదేశంతోపాటు క్రొత్తగా పురుడుపోసుకొన్న జగన్‌పార్టీల పరిస్థితి అగమ్యగోచరంగా వుంది. నాయకత్వలేమి, ప్రజల్లో ఆదరణ లేకపోవడం, వర్గపోరు మూడు పార్టీలను వేధిస్తున్న సమస్యలు. కాంగ్రెస్ పార్టీ విషయానికొస్తే ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి ప్రాతినిధ్యం వహిస్తున్నప్పటికీ ప్రజలకు అందుబాటులో లేకపోవడం సమస్యగా మారింది. ద్వితీయశ్రేణి నాయకులు వున్నా వారు అధికారాన్ని అడ్డుపెట్టుకొని పైరవీల్లో మునిగితేలుతున్నారు తప్ప ప్రజల సమస్యలు పట్టించుకోవడం లేదు. ఇక ప్రతిపక్ష తెలుగుదేశం పార్టీ పరిస్థితి దయనీయంగా వుంది. మాజీ ఎమ్మెల్యే కొమ్మి లక్ష్మయ్యనాయుడు, యువనేత కన్నబాబులకు మధ్య వర్గవిభేదాలు తారస్థాయికి చేరుకొన్నాయి. ఈ ప్రభావం పార్టీ కార్యక్రమాలపై పడుతోంది. నియోజకవర్గంలో టిడిపికి మంచిపట్టు ఉన్నప్పటికీ వర్గపోరు కారణంగా ప్రజల్లోకి వెళ్లలేకపోతున్నారు. మిగతా ప్రాంతాలతోపాటు కన్నబాబు సొంతూరైన కరటంపాడులోనూ కొమ్మికే బలం వుండగా, అధిష్టానం వద్ద మాత్రం కన్నబాబు గట్టిపట్టు సంపాదించాడు. ఇక క్రొత్తగా ఏర్పాటైన జగన్‌పార్టీకి ప్రజల్లో ఆదరణ ఉన్నప్పటికీ సమర్థుడైన నాయకుడు లేకపోవడంతో పార్టీ ముందుకెళ్లలేకపోతోంది. మొత్తం మీద మూడు పార్టీలు పలురకాల సమస్యలతో సతమతం అవుతున్నాయి.

# మొరాయిస్తున్న కండలేరు గేట్లు

కండలేరు జలాశయం గేట్లు పూర్తిస్థాయిలో పని చేసేలా చేయడంలో అధికారులు విఫలం కావడంతో నీరు వృధా అవుతోంది. ఈ ఏడాది వరదలు, వర్షాల కారణంగా జలాశయంలో 50టిఎంసిల నీటిని నిల్వ చేసి రికార్డు నమోదు చేశారు. డ్యాం నుంచి చెన్నై, తిరుపతి పట్టణాలకు దాహార్తిని తీర్చేందుకు, చిత్తూరు జిల్లాతోపాటు, నెల్లూరు జిల్లా సాగునీటి అవసరాలకు ఈ నీటిని వినియోగిస్తారు. ఎంతో ప్రాధాన్యత గల జలాశయం హెడ్ రెగ్యులేటర్ గేట్లు పనిచేయకపోతుండడం పెద్ద సమస్యగా మారింది. వీటి నిర్వహణ పట్ల

### నీళ్లు వృధా

ఇంజనీరింగ్ అధికారులు తగిన శ్రద్ధ పెట్టకపోవడంతో నీటిని విడుదల చేసే సందర్భంలోను, నిలుపుదల సమయంలో గేట్లు మొరాయింస్తుండడంతో నీరు వృధా అవుతోంది. నీటి వృధాను అరికట్టాలని, గంగ నీటిని విలుపుదల చేయాలని పైనుంచి ఉన్నతాధికారులు ఆదేశాలిస్తున్నా గేట్లు మూతపడకపోవడంతో సమస్యలు తలెత్తున్నాయి. అధికారులు ట్రాక్టర్లు ఏర్పాటు చేసి గేట్లను దించే ప్రయత్నం చేస్తున్నా అది విఫలమవుతుండడంతో కసరత్తు చేయాల్సి వస్తోంది.

# సబ్‌ట్రెజరీలో లంచావతారాలు

## నాయుడుపేటలో ఇబ్బంది పడుతున్న వుద్యోగులు

నాయుడుపేట సబ్‌ట్రెజరీ కార్యాలయంలో చేయితడపందే బిల్లులు కాకపోవడంతో ఉద్యోగులు, కాంట్రాక్టర్లు వీరి దెబ్బకు హడలిపోతున్నారు. నాయుడుపేట, పెళ్లకూరు, ఓజిలి మండలాలకు చెందిన పంచాయితీలు, హాస్టళ్లు, మండల కార్యాలయాలు, ఉపాధ్యాయుల జీతాలతోపాటు కాంట్రాక్టు బిల్లులు అన్ని ఈ ట్రెజరీ నుంచే చెల్లించాల్సి వుండడంతో వీరు ఆడింది ఆటైంది. ప్రతి పనికి కమీషన్ ఇవ్వందే ఫైల్ ముందుకు కదలదు. ఇటీవల 13వ ఆర్థికసంఘం నిధులు మంజూరైన విషయం తెలిసిందే. ఆ నిధులతో పంచాయితీల్లో త్రాగునీటి సరఫరా, పారిశుధ్యం మెరుగుపరచేందుకు మూడు మండలాల్లోని పంచాయితీలకు 22,78,139 రూపాయలు మంజూరయ్యాయి. పనులు పూర్తయిన పంచాయితీల్లో బిల్లులు చేసేందుకు ఆరు శాతం కమీషన్‌ను ఉప ఖజానా కార్యాలయ సిబ్బంది డిమాండ్ చేశారట. వీరు అడిగినంత చెల్లించాలంటే మొత్తం 1.36లక్షలు ఇవ్వాల్సి వస్తోందని సర్పంచ్‌లు వాపోతున్నారు. ఖజానా సిబ్బంది ఉద్యోగులనూ వదిలిపెట్టడం లేదట. ఇంత బరితెగించి లంచాలు గుంజుతున్న సిబ్బందిని ఆశాఖ ఉన్నతాధికారులు గాడిలో పెట్టలేకపోవడం విమర్శలకు తావిస్తోంది.

# బుచ్చిలో ఎర్రచందనం స్వాధీనం

● ఎర్రమట్టి లోడులో దుంగలు

బుచ్చిరెడ్డిపాళెం పట్టణంలో అక్రమంగా తరలిస్తున్న ఎర్రచందనం దుంగలను స్థానిక పోలీసులు పట్టుకొన్నారు. కలువాయి దగ్గర వీటిని వాహనంలో ఎక్కించి ఈ దుంగలు బయట పడకుండా వుండేందుకు ఎర్రమట్టిని లోడ్‌చేసి విజయవాడకు తరలిస్తుండగా సమాచారం అందుకున్న పోలీసులు స్థానిక అంబేద్కర్ విగ్రహం వద్ద టిప్పర్‌ను పట్టుకొన్నారు. పోలీసులను చూడగానే డ్రైవర్, క్లీనర్‌లు పారిపోయారని, వాహనంలో దాచి వుంచిన ఎర్ర చందనం విలువ 7లక్షలుగా వుంటుందని పోలీసులు తెలిపారు. చిత్తూరు జిల్లాకు చెందిన వ్యక్తులు వాహనంలో వీటిని రవాణా చేస్తున్నట్లు పోలీసులు చెప్తున్నారు. మొత్తం మీద స్మగ్లర్లు ఎర్ర చందనాన్ని పలు రూపాలలో తరలించేందుకు ప్రయత్నిస్తున్నట్లు ఇటీవల పట్టుబడుతున్న ఘటనలు నిరూపిస్తున్నాయి.

# కలువాయిలో నిలచిన పోస్టల్ బట్వాడా!

## సమాధానం చెప్పే అధికారే లేడు.

కలువాయిలో పోస్టల్ బట్వాడా అబందరగా మారింది. పోస్టుమెన్ సక్రమంగా విధులు నిర్వహించకుండా వేరొకరి చేత పనులు చేయిస్తుండడంతో పంపిణీ సక్రమంగా జరగడం లేదు. నెలల తరబడి ఉత్తరాలు, పత్రికలు బట్వాడా జరుగక నిలబడిపోతున్నాయి. గతంలో ఇక్కడ పని చేస్తున్న పోస్టుమెన్ నరసింహులు పదవీ విరమణ చేయడంతో ఆనాటి నుంచి రెగ్యులర్ పోస్టుమెన్‌ను నియమించలేదు. బ్రహ్మణపల్లి, కుల్లూరు నుంచి డెప్యూటేషన్‌పై నియమించేవారు. రెండు నెలల క్రిందట తిరుమలపాడుగ్రామ బ్రాంచి పోస్టుమాస్టర్ జివి.రత్నంను కలువాయికి పంపారు. ఆయన విధులను బాధ్యతగా చేయకుండా తన క్రింద మరో రిటైరైన వ్యక్తికి కొంత మొత్తం చెల్లించేటట్లు ఏర్పాటు చేసుకున్నాడు. అతని ద్వారా ఉత్తరాలు బట్వాడా చేయిస్తున్నా జీతం చెల్లింపులో ఏర్పడిన వివాదం వల్ల ఆ వ్యక్తి ఆగిపోయాడు. దీంతో బట్వాడా చేయకుండా ఇష్టానుసారంగా వ్యవహరిస్తుండడంతో నెలలుగా పత్రికలు, ఉత్తరాలు నిలచిపోయాయి. స్థానిక పోస్టుమాస్టర్‌ను ఈ విషయంపై ప్రశ్నిస్తే జిల్లా పోస్టల్ సూపరింటెండెంట్‌కు ఫిర్యాదు ఇవ్వమంటున్నాడట.


కొత్త కలెక్టర్ శ్రీధర్‌ను కలిసి పుష్పగుచ్ఛమందించి అభినందిస్తున్న జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకణి గోవర్ధన్‌రెడ్డి. ప్రక్కన రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి, జడ్పీ వైస్‌ఛైర్మన్ రాజా.

## అవార్డులకు విలువ లేదు!

**ఎమ్మెల్యే బీద ఆవేదన**

అవార్డుల ప్రదానం ఆయా వ్యక్తుల సేవను బట్టి కాకుండా రెకమెండేషన్‌లు, డబ్బులు, పలుకుబడిని బట్టి ఇస్తున్నారని కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు వ్యాఖ్యానించారు. కావలిలో ఇటీవల జరిగిన ఒక కార్యక్రమానికి హాజరైన ఆయన మాట్లాడుతూ నిస్వార్ధంగా సేవ చేసిన వారు ఎందరో దేశంలో వున్నా వారికి కాకుండా అధికార, రాజకీయ అండదండలతో అవార్డులు అందుకోవడం బాధాకరం అన్నారు. అలాంటి వారి వలన ఆ అవార్డులకే విలువ తగ్గిపోతోందని, ఇటీవల ప్రభుత్వం ప్రకటిస్తున్న పద్మభూషణ్, పద్మవిభూషణ్‌లు అందజేయడంలో ఇలాంటివి చోటు చేసుకొన్నాయని విమర్శించారు. నేటి సమాజంలో డబ్బే ప్రామాణికంగా మారిందని ఆవేదన వ్యక్తం చేశారు. భారత రాజ్యాంగ నిర్మాత అంబేద్కర్‌కు భారతరత్న అవార్డు ఇవ్వడానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత 34 ఏళ్లు పట్టిందన్నారు. నిత్యం రాజకీయాలు మాట్లాడే ఎమ్మెల్యే ఇలా అవార్డుల ఎంపికపై మాట్లాడడం చర్చనీయాంశమయ్యింది.

## పశుగ్రాసానికి కొరత

### ఎండలే కారణం

జిల్లాలో రోజురోజుకు అధికం అవుతున్న ఎండల కారణంగా పశువులకు సమస్యలు ఎదురౌతున్నాయి. మేత దొరక్క మూగ జీవాలు అల్లాడి పోతున్నాయి. పశువులు, గొర్రెలు, మేకలకు మేత, నీళ్లు తగినంత లభించక పోషకులు నానాతంటాలు పడాల్సి వస్తోంది. పశువుల గడ్డి కోసం రైతులు ఊరూవాడా తిరుగుతున్నారు. ఈ ఏడాది మెట్ట ప్రాంతాల్లో వరి సాగు తగ్గడం, భారీ వర్షాలు, వరదలకు పంటలు దెబ్బతినడం, రైతులు యంత్రాలతో పంటకోయడం తదితర కారణాలతో గడ్డిశాతం తగ్గిపోయింది. దీంతో జిల్లాలో పశుగ్రాసం కొరత అధికమయ్యింది. ముఖ్యంగా ఆత్మకూరు, ఉదయగిరిలాంటి ప్రాంతాల్లో మూగజీవాలకు మేత దొరక్క, నీటికొరత కారణంగా అల్లాడుతున్నాయి. వేసవిలో పశువుల మేత అవసరాలు తీర్చేందుకు, కొరత నివారించేందుకు ప్రభుత్వం పలు పథకాలను ప్రవేశ పెట్టినప్పటికీ అవి పశుపోషణకు అక్కరకు రావడం లేదు. ఉపాధిహామీ పథకంలో భాగంగా పశుగ్రాసాన్ని ఉత్పత్తి చేసేందుకు ఆరు పథకాలను రూపకల్పన చేశారు. నిధుల కేటాయింపు జరిగినా పథకం అమలులో జాప్యం జరగడంతో పశుగ్రాసం కొరత రైతులను పట్టిపీడిస్తోంది.

## ఆరోగ్య కేంద్రానికి తాళాలు

అద్దె చెల్లించని కారణంగా ఆస్పత్రికి తాళం వేసిన ఘటన కావలి పట్టణంలో జరిగింది. పట్టణంలోని ప్రజలకు వైద్య సేవలు అందుబాటులోకి తెచ్చేందుకు రాజీవ్‌నగర్, వెంగళరావ్ నగర్‌తోపాటు వైకుంఠపురంలోను ఆరోగ్య కేంద్రాన్ని ఏర్పాటు చేశారు. డాక్టర్లు, వైద్య సిబ్బంది అక్కడ విధులు నిర్వహిస్తున్నారు. ఆరోగ్య కేంద్రాన్ని ఏర్పాటు చేసిన భవనానికి గత 14 నెలలుగా అద్దె చెల్లించడం లేదట. దీనిపై ఆ భవన యజమాని పలుమార్లు అధికారులను కోరినా స్పందన లేకపోవడంతో ఒళ్లు మండిన యజమాని ఆస్పత్రికి తాళం వేయడమేకాకుండా ఆస్పత్రి బోర్డును తొలగించి వేశాడు. రాత్రికి రాత్రి రంగులు వేయడంతో వైద్య సేవలకు విఘాతం ఏర్పడింది. డివిజన్ ఉప వైద్యాధికారి సుధాకర్ స్పందిస్తూ ఆస్పత్రి మూతపడిందని, ఈ విషయాన్ని ఉన్నతాధికారుల దృష్టికి తీసుకొని వెళతామని చెప్పారు. మొత్తం మీద బాడుగ చెల్లించకపోవడంతో ఆ ప్రభావం ప్రజలపై పడింది.

# చిరుత పులులకు రక్షణేది?

### వెలుగొండ అడవుల్లో పట్టీపట్టని అటవీ సిబ్బంది

జిల్లాలో అటవీ ప్రాంతంలో ఫారెస్టు అధికారుల నిర్లక్ష్యం కారణంగా చిరుత పులులకు రక్షణ కరువవుతోంది. రాపూరు ప్రాంతంలో గల వెలుగొండ అడవులు సరిహద్దు జిల్లాలైన కడప, చిత్తూరు జిల్లాలకు విస్తరించివున్నాయి. ఈ నేపథ్యంలో రావూరు రేంజ్ పరిధిలో చిరుత పులుల సంచారం వున్నట్లుగా అధికారులు గుర్తించారు. షుమారు 14వరకు పులులు తిరుగుతున్నట్లు అటవీశాఖాధికారులు చెప్తున్నారు. అడవుల్లో ప్రత్యక్షంగా కన్పించకపోయినా వాటి కాలి ముద్రలను బట్టి సంచారాన్ని గుర్తిస్తారు. వేసవి కాలం కావడంతో దప్పిక తీర్చుకొనేందుకు పులులు బయటకు వస్తున్నాయి. గరిమెనపెంట, గోనుపల్లి, చీపినాపి, తెగచెర్ల, వెంకటగిరి రేంజ్ పరిధిలోగల అడవుల్లో పులుల సంచారం అధికంగా వుందట. వన్యప్రాణుల సంరక్షణ అటవీశాఖదే అయినప్పటికీ అధికారులు తగిన చర్యలు చేపట్టకపోవడంతో వాటికి రక్షణ కరువైనట్లు తెలుస్తోంది. నిత్యం అటవీ ప్రాంతంలో తిరుగుతూ పరిస్థితులను తెలుసుకోవాల్సిన అటవీశాఖ క్షేత్ర స్థాయి సిబ్బంది ఆ దిశగా పని చేయకపోవడంతో పులులు తిరుగుతున్న సమాచారం అధికారుల వద్ద వుండడం లేదు. ఈ పరిస్థితుల్లో స్మగ్లర్లు పులులను సంహరిస్తున్నట్లు ఇటీవల జరుగుతున్న ఘటనలు తెలియజేస్తున్నాయి. గరిమెనపెంట వద్ద మరణించిన చిరుత కళేబరం, గోళ్లు లభ్యం కావడం రక్షణ కరువైందన్న నిజాన్ని చాటుతోంది. ఈ ఘటన తర్వాతనైనా అటవీ శాఖాధికారుల పనితీరు మారాలి.

# 'చిరు' చిందులకు కారణమేంటో!!



కడప ఉప ఎన్నికల ప్రచారంలో చిరంజీవి చిందుల్ని చూసి కాంగ్రెస్ వారే నోటిమీద వేలేసుకుంటున్నారు. ప్రజారాజ్యం పార్టీని అధికారికంగా కాంగ్రెస్‌లో కలపకుండానే ఆ పార్టీ కండువా వేసుకున్నాడు చిరంజీవి. అంతటితో ఆగకుండా కడప ఎన్నికల ప్రచారానికి వెళ్లాడు. ఎంతైనా సినిమా హీరో కదా! మీసాలు మెలేశాడు. తొడగొట్టాడు. అసలు జగన్ ఎవడు? వాడి బతుకేంటి? అన్న తీరులో చిందులు వేశాడు. వై.ఎస్‌పై, జగన్‌పై 'చిరు' నోరుపారేసుకున్నాడు. స్థాన బలములేని చోట వై.ఎస్ వర్గీయుల్ని దూషించడం కాంగ్రెస్ నాయకులకే నచ్చలేదు. వాళ్లు వారించబోయినా 'చిరు' వినలేదు. జనాన్ని చూసి రెచ్చిపోయాడు. జగన్ గిగన్ జాన్తానై... కాంగ్రెస్‌కే ఓటేయండి అంటూ మెగా పిలుపు ఇచ్చాడు. చిరు ప్రక్కనే వున్న కాంగ్రెస్ అభ్యర్థులు వై.ఎస్ వివేకా, డిఎల్ రవీంద్ర మాత్రం అసహనంగా వున్నా చిరు పట్టించుకోకుండా జీవించాడు. ఏళ్ల తరబడి కాంగ్రెస్‌లో వున్న వాళ్లు కూడా ఇలా మాట్లాడటం లేదు. ఇంకా పార్టీ అరంగేట్రం కూడా చేయని చిరు ఎందుకిలా పెట్రేగిపోతున్నాడోనని కాంగ్రెస్ నాయకులు ఆరా తీశారట. త్వరలో తనకు కేంద్రమంత్రి పదవి, తనవాళ్లకు రాష్ట్రమంత్రి పదవులు కట్టబెట్టకపోతారా! అన్న ధీమాతోనే 'చిరు' చిందులు వేసినట్లు ఆయన వర్గీయులు చావు కబురు చల్లగా చెప్పారట. ప్చ్! పాపం చిరు! కాంగ్రెస్‌ను కాస్తంత గట్టిగానే నమ్మినట్లున్నాడు.

# బొత్స వైరాగ్యం



రాష్ట్రమంత్రి బొత్స సత్యనారాయణ తీవ్ర వైరాగ్యంలో వున్నాడు. కడప జిల్లాలో జరుగుతున్న ఎన్నికలకు పార్టీ ఇన్‌ఛార్జ్‌గా వున్న బొత్సాకు మనసు కకా వికలమైందట. ఇంతకూ ఆయన వైరాగ్యానికి కారణం ఏమంటే? కడప ఎన్నిక తీరే అంటూ బొత్సా కుండబద్దలు కొట్టినట్లు చెబుతున్నాడు. తన జీవితంలో ఇటువంటి చెత్త ఎన్నికల్ని ఎప్పుడూ చూడలేదంటూ నెత్తీనోరూ బాదుకుంటున్నాడట. జమ్మలమడుగు అసెంబ్లీ నియోజకవర్గ ఇన్‌ఛార్జ్‌గా రెండు వారాలుగా అక్కడే బస చేసివున్న బొత్సాకు ఎన్నో చేదు అనుభవాలు ఎదురవుతున్నాయట. ఇవేం ఎన్నికలు? నా జన్మలో ఇటువంటి ఎన్నికల్ని చూడలేదు. ఇలాగైతే ఇక రాజకీయాలు చేసినట్లే! అంటూ వాపోతున్నాడు. ఇంతకూ తమ అనుభవాలేంటో చెప్పండి బాబూ అంటూ నిలదీస్తున్న విలేకరులకు మాత్రం ఆ ఒక్కటి అడక్కండి! అంటూ దాటేస్తున్నాడు. మొత్తానికి తన వైరాగ్య కారణాలతో మంత్రి గారు త్వరలో పుస్తకం వ్రాసినా ఆశ్చర్యం లేదంటున్నారు ఆయన అనుచర గణం.

# సచివాలయానికి సెలవు



రాష్ట్రప్రభుత్వ యంత్రాంగానికి గుండెకాయలాంటి సచివాలయానికి సెలవులు ప్రకటించారా! ఇక్కడి పరిస్థితిని చూస్తే అలా వుంది మరి. మంత్రులు, ముఖ్యమంత్రి కడప ఉప ఎన్నికల ప్రచారానికి వెళ్లడంతో సచివాలయం వెలవెలబోతోంది. హోంమంత్రి సబిత ఒక్కర్తే సచివాలయానికి రెగ్యులర్‌గా హాజరవు తున్నారు. స్థానిక ఎమ్మెల్యే అక్బరుద్దీన్ ఒవైసీపై దాడి జరగడంతో హోంమంత్రి నగరంలోనే వుండి ప్రతిరోజూ శాంతి భద్రతల గురించి పోలీసు బాస్‌లతో సమీక్షిస్తున్నారు. అయితే గత పదిరోజులుగా సచివాలయానికి వస్తున్న మంత్రుల సంఖ్య మూడుకు దాటడం లేదు. సోమవారం నుండి ముఖ్యమంత్రి కూడా కడపజిల్లా పర్యటనలో వుండటంతో సచివాలయానికి వచ్చే సందర్శకులు కూడా కరువయ్యారు. మంత్రులు లేకపోవడంతో ఐఎఎస్‌లు కూడా గైర్హాజరవుతున్నారు. ఎవరూ లేకపోతే ఇక మన మెందుకు? అనుకున్నారో ఏమో గానీ సందర్శకులు కూడా సచివాలయం ప్రక్కకు కూడా రావడం లేదు. వాతావరణం చూస్తుంటే సచివాలయానికి వేసవి సెలవులు ప్రకటించారన్నట్లుంది. ముఖ్యమంత్రి, మంత్రులు, ఐఎఎస్‌లు లేక రోజువారీ ఫైళ్ల సైతం కుప్పలుగా పేరుకుపోతున్నాయి. కడప ఎన్నికలయ్యే వరకు ఫైళ్లకు మోక్షం లేనట్లేనని సచివాలయ వర్గాలు పెదవి విరుస్తున్నాయి.




# 'బాబు' అత్యుత్సాహం



చంద్రబాబు ఈ మధ్య ఉత్సాహంగా వుంటున్నాడు. దీనికి కారణమేమై వుంటుందబ్బా అంటూ తెలుగు తమ్ముళ్లు జుట్టుపీక్కుంటున్నారట. కడప ఉప ఎన్నికల ప్రచారం తర్వాత బాబు వైఖరిలో కొట్టొచ్చినట్లు మార్పు కనబడుతోంది. ఎప్పుడూ సీరియస్‌గా వుండే బాబు ఈ మధ్య కాస్తంత నవ్వుతున్నాడట. కడప ఎన్నికల ప్రచారంలో మీటింగులకు, రోడ్‌షోలకు జనం పెద్ద సంఖ్యలో హాజరు కావడమే బాబు ఉత్సాహానికి కారణమట. కడప జిల్లాలో రఘురామిరెడ్డి వంటి ఉద్దండులు 'దేశా'నికి గుడ్‌బై చెప్పినప్పటికీ జనం మాత్రం తనతోనే వున్నా రని బాబు తెగ సంబర పడిపోతున్నాడు. అంతే కాదు కడప లోక్‌సభ ఎన్నికల్లో రెండోస్థానం తమకే దక్కుతుందన్న ధీమా కూడా బాబు అత్యుత్సాహానికి కారణమంటున్నారు. కడప పోరులో ఎలాగో అలాగ జగన్ నెగ్గినా... ఆ తర్వాత స్థానం తెలుగుదేశానికి రావడం ఖాయమని 'బాబు' తెగసంబర పడిపోతున్నాడు. దింపుడు కళ్లెం ఆశ అంటే ఇదే కాబోలు!!

# ఇల్లు చక్కదిద్దుకో! కిరణ్‌కు అల్టిమేటమ్



ఇంటిని చక్కదిద్దుకోవాలంటూ ముఖ్యమంత్రి కిరణ్‌కు పార్టీ అధిష్టానం అల్టిమేటమ్ ఇచ్చిందా! అవుననే అంటున్నాయి ఆయన సన్నిహిత వర్గాలు. సిఎం పగ్గాలు చేతికిచ్చి నెలలు గడుస్తున్నా ఇంతవరకు పరిస్థితిలో ఏమాత్రం మార్పులేకపోవడం అధిష్టానానికి కోపం తెప్పిస్తోందట. కుర్రాడు... ఏదో క్రిందా మీద పడి నెట్టుకొస్తాడులే అనుకుంటే రోశయ్యే మేలు! అన్నట్లుంది పరిస్థితి. రాష్ట్రంలో ప్రభుత్వ పనితీరు మూలపడింది. పార్టీ పరిస్థితి అంతంత మాత్రమే. ఇక వచ్చే ఎన్నికల్లో ఎలా నెట్టుకురావడం? అని అధిష్టానం తీవ్రంగా ఆలోచిస్తోందట. పార్టీ ఇన్‌ఛార్జ్‌గా బాధ్యతలు తీసుకున్న గులామ్‌నబీ ఆజాద్ కూడా కిరణ్ పని తీరు పట్ల పెదవి విరుస్తున్నాడు. రాష్ట్రంలో పనిచేసే ప్రభుత్వం లేదంటూ ఆజాద్ అధిష్టానానికి ఫిర్యాదు కూడా చేసినట్లు చెబుతున్నారు. దీంతో సాక్షాత్తు ఢిల్లీ పెద్దలు రంగంలోకి దిగాల్సి వచ్చింది. ఇప్పటికైనా మించిపోయిందేమీ లేదు. పరిస్థితుల్ని చక్కదిద్దుకోమంటూ కిరణ్‌కు వర్తమానం పంపారు. పాపం కిరణ్! అసలే అనుభవరాహిత్యం... దీనికితోడు కడప ఉప ఎన్నికలు... తెలంగాణ ఉద్యమం... దివాళా తీసిన ఖజానా! ఏం చేయాలో పాలుబోక ఉక్కిరి బిక్కిరి అవుతున్నాడు.

# దశావతారాలలో ఆరవ అవతారం
## పరశురామావతారం!



లోకంలో ధర్మరక్షణకు, దుష్టశిక్షణకు నారాయణుడు ఆవిర్భవించిన దశావతారాల్లో పరశురామావతారం ఆరవది. త్రేతాయుగం ఆరంభంలో అధికార బల మదాంధులైన క్షత్రియులను శిక్షించేందుకు ఎత్తిన అతారమిది. భూభారాన్ని తగ్గించి క్షత్రియుల గర్వాన్ని అణచి శాంతిని నెలకొల్పడానికి సాక్షాత్తు విష్ణువే సూర్యతేజస్సుతో మనుష్య రూపంలో పరశురాముడిగా అవతరించాడని విష్ణు ధర్మోత్తర పురాణం, అగ్నిపురాణం, భాగవతం వివరించాయి. ఈ అవతారం విలక్షణమైనది, ఇతర అవతారాలకంటే భిన్నమైన తాత్వికత కల్గినది.

పరశురాముడు వైశాఖ శుక్ల తృతీయనాడు జననమొందినట్లు స్కంద, బ్రహ్మాండ పురాణాలు పేర్కొన్నాయి. పరశురాముని తల్లి రేణుక, తండ్రి జమదగ్ని. ఒకనాడు రేణుక నదీజలాన్ని తేవడానికి వెళ్ళి అక్కడ అప్సరసలతో క్రీడించే గంధర్వరాజైన చిత్రరథుడిని చూసి ఆమె మనసు క్షణకాలం చలిస్తుంది. అక్కడకు వచ్చిన జమదగ్ని ఆమె మనసును యోగదృష్టితో కనిపెట్టి రేణుక శిరస్సు ఖండించవలసినదిగా ఆజ్ఞాపించగా తండ్రి మాటను జవదాటని పరశురాముడు తల్లి తలను నరికి జమదగ్ని మెప్పు పొందుతాడు. ఆయన అనుగ్రహించి వరం కోరుకొమ్మంటే తల్లిని బ్రతికించమని కోరగా జమదగ్ని అనుగ్రహిస్తాడు.

హైహయ వంశీయుడైన కార్తవీర్యార్జునుడు అనే రాజు జమదగ్ని ఆశ్రమం నుంచి కామధేనువును అపహరించగా, పరశురాముడు ఆ రాజుతో యుద్ధం చేసి అతని వెయ్యి చేతులు, తలను తన అఖండ పరశువుతో ఛేదించి కామధేనువును తిరిగి తన తండ్రి వద్దకు చేరుస్తాడు. కార్తవీర్యుని కుమారులు పరశురాముడు లేని సమయంలో ఆశ్రమంలోకి ప్రవేశించి జమదగ్నిని వధిస్తారు. అప్పుడు రేణుక 21సార్లు తండ్రి శవంపైపడి రోదించడాన్ని చూసి ఆగ్రహించిన పరశురాముడు కార్తవీర్యుని కుమారులనే కాక యావత్ క్షత్రియులపై 21 మార్లు దండెత్తి ఆ వంశాన్ని నాశనం చేసినట్లు పురాణాలు చెప్తున్నాయి. చివరన తాను సంపాదించిన భూమినంతటిని కశ్యపుడికి దానం చేసినందున భూమికి కాశ్యపి అనే పేరొచ్చిందని చెప్తారు. తర్వాతి కాలంలో మహేంద్రగిరికి వెళ్ళి భార్గవరాముడు తపస్సు ఆచరించినట్లు పురాణ కథనం. ♦



## ట్రంకురోడ్డు కబుర్లు

### మహీధర్‌రెడ్డి మొహమాటం



ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి ఒత్తిడితో రాష్ట్ర మంత్రులంతా కడప ఉప ఎన్నికల ప్రచారానికి సమకడుతున్నారు. ఇక్కడకు కాస్త ఆలస్యంగా బయలుదేరిన మునిసిపల్ మంత్రి మానుగుంట మహీధర్‌రెడ్డిని కడపలో కాంగ్రెస్ పార్టీ పరిస్థితి ఏమిటి? మూడవ స్థానమా అని విలేకరులు అనే సరికి మంత్రి వారిపై కస్సుబుస్సులాడారు. తినబోతూ రుచెందుకు అడగాలని ఎదురు ప్రశ్నించారు. రెండు దశాబ్దాల క్రితం కావలి అసెంబ్లీ స్థానానికి ఉప ఎన్నిక జరిగితే అప్పుడు రాష్ట్రంలో అధికారంలో వున్న తెలుగుదేశం పార్టీ, కాంగ్రెస్ అభ్యర్థి కలికి యానాదిరెడ్డిని ఓడించను 15 మంది రాష్ట్ర మంత్రులను పంపిన విషయం గుర్తు చేశారు. ఈ పోలిక బాగానే వుంది కానీ ఆ ఎన్నికల్లో మంత్రులెందరు ప్రచారం చేసినా చివరికి గెలిచిందెవరో మంత్రికి తెలిసినా కూడా ఈ విధంగా వ్యాఖ్యానించారా అని ట్రంకురోడ్డులో జనం అనుకొంటున్నారు.

### మాట మారింది!




నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి నాలుగు నాల్కల ధోరణిలోనూ మాట్లాడగల ఘనాపాటి. ఈ వారంలో ఒక రోజు కడప ఎన్నికల ప్రచారానికి వెళ్లి వచ్చిన ఆయన మాట ధోరణి మారింది. కడపలో ముక్కోణపు పోటీ జరుగుతుంది. భవిష్యత్తు రాజకీయాలను ఇక్కడి ఎన్నికల ఫలితాలు తీవ్రంగా ప్రభావితం చేస్తాయని ఆయ నిచ్చిన అర్థంకాని స్టేట్‌మెంట్ చూసి ఎసి సెంటర్ లోని ఆయన అనుచరులు కూడా దీర్ఘాలోచనలో పడ్డారు.

### పాపం... టీడీపి కార్పొరేటర్లు!

గతంలో మునిసిపల్ కౌన్సిలర్లు, కార్పొరేటర్లంటే ప్రత్యేకమైన గౌరవముండేది. ఇప్పుడా గౌరవం బాగా తగ్గిపోయింది. నెల్లూరులో ప్రతిపక్ష కార్పొరేటర్లను వివేకానందరెడ్డి ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ల తాగిస్తున్నాడన్నది అందరికీ తెలిసిందే. తమ డివిజన్లకు శానిటరీ ఇన్స్‌పెక్టర్లు, కార్మికులు రావడం మానేయడంతో వీధులన్నీ చెత్తమయమయ్యాయని 42, 45, 46 డివిజన్లకు చెందిన తెలుగుదేశం కార్పొరేటర్లు కార్పొరేషన్ కార్యాలయం ముందు ధర్నాకు దిగారు. పారిశుద్ధ్య సిబ్బందిని మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, ఎమ్మెల్యేలు వివేకానందరెడ్డి, శ్రీధర్‌కృష్ణారెడ్డి ఇళ్ల దగ్గర పెడితే మిగతా జనం మాటేమిటని కమిషనర్‌ను తెలుగునాయకులు ప్రశ్నించారు. కానీ కమిషనర్ సమాధానం చెబితేగా?

### పార్టీ బాగు కోరితే...



కోవూరు ఎమ్మెల్యే నల్లపరెడ్డి ప్రసన్న కుమార్‌రెడ్డి తెలుగుదేశం పార్టీ ఆదేశాలను ధిక్కరించి వ్యవహరిస్తుండడంతో ఆయనను శాసనసభ్యత్వానికి అనర్హుడిని చేయాలని ఆ పార్టీ డిప్యూటీ స్పీకర్‌ను కలిసి కోరింది. పార్టీ ధిక్కారంపై పలు ఆధారాలుండడంతో వేటు ఖాయమని భావిస్తున్న తరుణంలో ఆయన పాత పాట అందుకొన్నారు. చంద్రబాబు పార్టీని భ్రష్టుపట్టించాడు. గత ఎన్నికల్లో పార్టీ ఓడిపోవడానికి తెలంగాణాలో డిపాజిట్లు గల్లంతు కావడానికి ఆయన కారకుడని, ఆయన్ను పార్టీ అధ్యక్షుడిగా మార్చమని కోరితే తన శాసన సభ్యత్వాన్ని రద్దు చేయమని కోరడం మంచి పద్ధతి కాదన్నారు. తాను నియోజకవర్గ అభివృద్ధి కోసమే అధికారంలో వున్న ముఖ్యమంత్రులతో బాగుంటున్నానని అసలు నిజం చెప్పేశారాయన.

### మెజార్టీ మూడు లక్షలు



కడప ఉప ఎన్నికల్లో జగన్ తరపున ప్రచారం చేస్తున్న నేతల్లో నెల్లూరు వాళ్లే ఎక్కువగా వున్నారు. నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి, ఉదయగిరి ఎమ్మెల్యే చంద్రశేఖర్‌రెడ్డి బద్వేల్ నియోజకవర్గం ఇన్‌ఛార్జ్ బాధ్యతలు తీసుకొని వున్నారు. ప్రచారంలో పాల్గొంటూనే నెల్లూరు వచ్చిన మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి కడపలో జగన్‌కు మూడు లక్షల ఓట్ల మెజార్టీ ఖాయమని జోస్యం చెప్పారు. పులివెందుల అసెంబ్లీ నియోజకవర్గం నుంచి పోటీ చేస్తున్న విజయమ్మకు 50వేల ఓట్ల మెజార్టీ వస్తుందని, దివంగత వైఎస్ రాజశేఖర్‌రెడ్డి గతంలో ప్రవేశపెట్టిన పథకాలు, ఆయనపై వున్న అభిమానమే కడపలో వైఎస్ఆర్ కాంగ్రెస్‌ను గెలిపిస్తుందని తేల్చి చెప్పేశారాయన.




కళత్ర సంబంధం బాగుండదు. ఉద్యోగంలో నూతన బాధ్యతలు అధికం. విసుగును తెప్పిస్తాయి. గృహిణులకు బంధువుల రాక విశ్రాంతి రాహిత్యాన్నిస్తుంది. గ్యాస్ట్రిక్, ఈఎన్‌టి బాధలుండవచ్చు. కుటుంబసభ్యులతో సఖ్యత తగ్గుతుంది. ఆర్థికవిషయాలు కొంత తృప్తికరంగా ఉంటాయి. భాగస్వాములతో సఖ్యంగా ఉండడానికి ప్రయత్నించండి. ఆర్థికలావాదేవీలు జాగ్రత్త.




అలసట, చిరాకు పనుల్లో ఆటంకాలు ఉంటాయి. కుటుంబసభ్యులతో మృదువైన పలకరింపులు ఉండాలి. ఆరోగ్య విషయంలో కూడా కొంత జాగ్రత్త అవసరం. ఊహించని మార్పులు ఇరకాటంలో పెడతాయి. ఆదాయం తృప్తికరంగా ఉన్నప్పటికి ఎదురు చూడని ఖర్చులు తబ్బిబ్బు చేస్తాయి. అలసట శ్రమాధిక్యత వుంటుంది. ఒకటికి రెండుసార్లు ఆలోచించి చేయడం మంచిది.




ఆర్థికలావాదేవీలు చక్కగా కుదుర్తాయి. ఇచ్చి పుచ్చుకోడాలు చక్కని ఫలితాల నిస్తాయి. వ్యవహారాలలో మంచి మార్పులు వస్తాయి. ఆగిన పనులు ఊపందుకొంటాయి. అనుకూల సంభాషణలతో మీ పని సాధించుకొంటారు. పరోక్ష శత్రుత్వం దూరమవుతుంది. వృత్తి వ్యాపారాభివృద్ధి కోసం అప్పులు చేస్తారు. సోదరుల మూలంగా శ్రమ. మార్పులు జరిగే అవకాశాలున్నాయి.




ఆత్మవిశ్వాసంతో అన్ని పనులు నిరాటంకంగా సాగించుకొంటారు. దూరప్రాంతాల్లో ఉన్న ఇష్టులను కలుసుకొంటారు. దైవదర్శనంతో ఆత్మస్థైర్యాన్ని మనశ్శాంతిని పొందుతారు. ఆర్థికలావాదేవీలు చక్కగా కుదుర్తాయి. ఇచ్చి పుచ్చుకోడాలు చక్కని ఫలితాల నిస్తాయి. వ్యవహారాలలో మంచి మార్పులు వస్తాయి. ఆగిన పనులు ఊపందుకొంటాయి. వసతిగృహ మార్పిడులకు అవకాశాలున్నాయి.




వృత్తి వ్యాపారాలలో వచ్చే సదవకాశాలను జారవిడుచుకోకండి. గృహ పరిసరాలను శుభపరచి, గృహాలంకరణపై ఆసక్తి చూపుతారు. మీరు చేసే వృత్తిలో అభివృద్ధికిగాను చేసే ప్రయత్నాలు ఫలవంతమౌతాయి. ఇష్టమైనవారితో శుభకార్యాలలో పాలు పంచుకొంటారు. మంచి భవిష్యత్తుకై నూతన ప్రయత్నాలు ప్రారంభిస్తారు. పిల్లలు మీ మనసెరిగి నడుచుకొంటారు.




కంటికి, ఊపిరితిత్తులకు సంబంధించి ఇబ్బందులు కొద్దిగా ఉండవచ్చు. పెద్దల సాయంతో ఉద్యోగవృద్ధి, వేతనవృద్ధి ఉంటుంది. స్థిర ధనాగమం ఆనందాన్నిస్తుంది. బంధువులకు మీ చేతనైన సహాయం చేస్తారు. వ్యాపారులు కొత్త సంబంధాలు ఏర్పరచుకొంటారు. రాజకీయులకు ప్రోత్సాహకరమైన కాలం. దూరప్రయాణాలు మానుకోవాలి. కళత్ర ఆరోగ్యం జాగ్రత్త.

# వారఫలాలు

*తేది 7-5-2011 నుండి 13-5-2011 వరకు మేషంలో రవి, కుజ, గురువులు; మేష, మీనాల్లో బుధ, శుక్రులు; ధనుస్సులో రాహువు; కన్యలో శని; మిథునంలో కేతువు; మిథున, కర్కాటక, సింహ, కన్యల్లో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

8 తేదీ గంగా పుష్కరాలు.
11 తేది నిజ కర్తరి ప్రారంభం.

### శుభ ముహూర్తాలు

9 తేదీ కర్కాటక లగ్నాన ఉ.10.00 నుండి 12.00గంటల వరకు.
8,9,11,13 తేదీల్లో సింహ లగ్నాన ప.1.00 నుండి 3.00 గంటల వరకు, మకర లగ్నాన రా.11.00 నుండి 01.00 గంట వరకు, కుంభ లగ్నాన రా.1.30 నుండి 3.00 గంటల వరకు శుభ ముహూర్తాలున్నాయి.

### మే తిథులు

వైశాఖ శుద్ధ

| | | | | |
|---|---|---|---|---|
| 7 | శని | చవితి | ప.2.10 | గం.ల.వ |
| 8 | ఆది | పంచమి | ప.1.18 | గం.ల.వ |
| 9 | సోమ | షష్ఠి | ప.12.55 | గం.ల.వ |
| 10 | మంగళ | సప్తమి | ఉ.11.26 | గం.ల.వ |
| 11 | బుధ | అష్టమి | ఉ.9.20 | గం.ల.వ |
| 12 | గురు | నవమి | ఉ.7.06 | గం.ల.వ |
| | | దశమి | తె.3.50 | గం.ల.వ |
| 13 | శుక్ర | ఏకాదశి | తె.2.20 | గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు – 1.
E-mail:maripmgg@yahoo.com




నూతన వృత్తి వ్యాపారాలకు సంబంధించి పునాదులు వేస్తారు. కుటుంబంలో సుఖశాంతులు నెలకొంటాయి. చేసే ప్రయాణాలు సత్ఫలితాలనిస్తాయి. ధనలోపం వుండదు. కోరిన బదలీలు జరుగవచ్చు. ఆహ్లాదకరమైన వార్తాశ్రవణ ప్రాప్తి. బ్యాంకు నిల్వలు పెంచే ప్రయత్నాలు చేస్తారు. వృత్తిలో కోరుకొన్నవి జరుగుతాయి. శుభకార్యాలకు ఖర్చు చేస్తారు. వినోదయాత్రల్లో పాలు పంచుకొంటారు.




రుణాలకు సంబంధించిన ఆలోచనలు చేస్తారు. వృత్తి ఉద్యోగాలలో శ్రమకు గురౌతారు. మానసిక ఆరోగ్యం దెబ్బ తింటుంది. దైవచింతన కొంతవరకు మేలు చేయవచ్చు. రియల్ ఎస్టేట్ వ్యవహారాలు లాభకరంగా ముగుస్తాయి. విలువైన గృహోపకరణాలు కొంటారు. పనుల్లో జాప్యం లేక త్వరగా ముగించి లాభపడతారు. కళత్రసుఖం చక్కగా ఉంటుంది. ప్రయాణాలలో విఘ్నాలుంటాయి.




మిత్రుల మూలంగా శుభవార్తా శ్రవణం. వివాహాది శుభకార్యాలకు ప్రేరేపణ జరుగుతుంది. నూతన మిత్రుల పరిచయం లభిస్తుంది. ఇంటా బయటా గౌరవ మర్యాదలు. ఇరుగు పొరుగు మరియు సమ సమాజంలో గౌరవ మర్యాదలు చక్కగా ఉంటాయి. నమ్మి వచ్చిన వారికి మీ వల్ల అయిన సాయమందిస్తారు. ఊహించని ధన ప్రాప్తి మిమ్మల్ని తబ్బిబ్బు చేస్తుంది. శుభవార్తా శ్రవణం.




ఆర్థికలావాదేవీలు చక్కగా కుదుర్తాయి. ఇచ్చి పుచ్చుకోడాలు చక్కని ఫలితాల నిస్తాయి. వ్యవహారాలలో మంచి మార్పులు వస్తాయి. ఆగిన పనులు ఊపందుకొంటాయి. నూతన వస్త్రాభరణాలు మనస్సుకు ఆనందాన్నిస్తాయి. నిలచి నిదానంగా పనులు నిర్వహించాలి. గడచిన రోజుల్లో సుఖానందాల్ని నెమరు వేసుకొంటారు. ఖర్చులు అదుపులో ఉంటాయి. మంచి మిత్రుల్ని కలుసుకొంటారు.




వృత్తిలో అధికారులు లేదా సమాజంలో ప్రముఖులు మీ సాయమర్థించి వస్తారు. వృత్తి వ్యాపారాల్లో అభివృద్ధి చక్కగా ఉంటుంది. సోదరుల వల్ల కోరుకొన్న రీతిలో సాయమందుతుంది. ఉత్సాహంతో దూకుడుగా పనులు సాగిస్తారు. గురువులను ఆధ్యాత్మిక ప్రభువులను దర్శిస్తారు. సోదరీ సోదరులతో హాయిగా కాలక్షేపం చేస్తారు. వృత్తి వ్యాపారాదుల అభివృద్ధికి మిత్రుల తోడ్పాటు చక్కగా లభిస్తుంది.




దేవాలయాలను, పుణ్యస్థలాలను దర్శిస్తారు. రుణమూలకంగా ధన ప్రాప్తి. కళత్ర సంబంధీకుల నుండి శుభవార్తాశ్రవణం. ధైర్యసాహసాలతో పనులు సాగిస్తారు. ధనాదాయం తృప్తికరంగా వుంటుంది. ఇష్టమైన అనుకూలమైన వార్త వింటారు. వృత్తి ఉద్యోగాల్లో మంచి వృద్ధి. కుటుంబంలో అనుకూల వాతావరణం. పరస్పర సహకారాలుంటాయి. ధనాదాయం ఊహించినంతకన్నా బాగుంటుంది.

# యజమానికి పుణ్యకర్మల ప్రాప్తికి స్వగృహం అత్యంతావశ్యకం!

*డాక్టర్ విజయలక్ష్మి — సికింద్రాబాద్*

** స్వగృహం ఆవశ్యకతను చాలా ధర్మశాస్త్రాలు చెప్పాయి? మీ అభిప్రాయం ఏమిటి?*

యజమాని నిర్వహించు శ్రౌత, స్మార్త, కర్మ క్రియా ఫలాలు వశిష్ట వాస్తు ప్రకారం యజమానికి దక్కుతాయి. ఫలితంగా యజమానికి గ్రహానుకూలత లభిస్తుంది. అందువల్ల బాడుగ గృహాల్లో జరిపిన ఈ క్రియ ఫలితాలు నివాసస్థుడికి గాక, ఇంటి యజమానికి చెందితే గృహస్థు కర్మక్రియలు నిర్వహించడం వ్యర్థం. అందువల్ల స్వగృహం ఆవశ్యకత ఎంతైనా వుంది.

*దేవరగాని సుబ్బారెడ్డి — బెంగుళూరు*

** గృహ నిర్మాణం వాస్తులో ఎన్ని విధానాల్ని పాటించాలి?*

స్థలం, నిర్మాణం, వస్తువు, అంతస్సూత్ర విధానాలనే నాలుగు విధానాల్ని వాస్తులో పాటిస్తే శారీరకంగా, మానసికంగా ఆరోగ్యంగా వుంటారు.

*ఎ.సుధాకర్ — నాయుడుపేట*

** సింహ ద్వారాలకు ఏగేటు ఎదురు రావాలి?*

ఉచ్చంలో పెద్ద గేటు, ద్వారానికి చిన్నగేటు మొత్తం కొలతలో 'సగం'(అర్థం)లోనే రావాలి!

*సి.హెచ్.శ్రీనివాసరావు — చెన్నై*

** రాత్రుళ్లు బాగా శబ్దాలు వినిపిస్తున్నాయి. నా ఆరోగ్యం కూడా అంతంత మాత్రమే.*

మీలో యాంగ్జైటీ న్యూరోసిస్ బాగా వుంది. ఛాయల కదలికలు, శబ్దాలు నిజమైతే 'నరఘోష యంత్ర ప్రతిష్ఠ' పచ్చధారణతో అవి ఆగిపోతాయి. మీరొకసారి సైకియాట్రిస్ట్‌ని కలవడం మంచిది.

*ఎన్.ఎం.త్రిష — సికింద్రాబాద్*

** చదివింది సులభంగా మరచిపోతాను. పరీక్ష హాలులో తల అసలు పనిచేయదు.*

మీరు వైఢూర్యం కుడి ఉంగరపు వ్రేలికి ధరించండి. 'శీతల' యంత్రాన్ని, దేవుడి గదిలో ప్రతిష్టించండి. జవాబుల్ని తరచూ గుర్తు చేసుకొనే (Recollecting Memory Chart) అనే విధానం మీ మెదడు ఆరోగ్యాన్ని సరి చేస్తుంది.

*హెచ్.భుజంగరావు — గూడూరు*

** నైరుతి వంట గది వల్ల ప్రమాదమా?*

నైరుతి రాక్షస స్థానానికీ, ఆగ్నేయం అగ్ని స్థానానికీ పడదు. పైగా పశ్చిమం పురుషులపైనా, దక్షిణం స్త్రీలపైనా అనారోగ్య ప్రభావాలు వుంటాయి.

*ఎన్.మంజులత — నెల్లూరు*

** అపార్టుమెంటులో ప్లాటు తీసుకొని మంచి రోజు చూసి చేరిపోయాము.*

ప్రారంభంలో మీరు వాస్తు చూపించుకొని వుంటే ఇప్పుడీ మనోవ్యధ కలిగేది కాదు. రెండవ తప్పిదం కొత్తదైనా, పాతదైనా ఇంట్లో నిమ్మ, టెంకాయ, గుమ్మడి 'బలి విధానాన్ని' పాటించి తీరాలి.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*డాక్టర్ ప్రదీప్ — చెన్నై*

** గృహ ప్రవేశం రోజు 'రక్త బలి' ఇవ్వాలన్న సిద్ధాంతం ఎలా వచ్చింది?*

ఇరవై ఎనిమిది వాస్తు శాస్త్ర ప్రతిపాదనలను సిద్ధాంతీకరించిన డాక్టర్ ఎడ్విన్ ఫెదర్ కూడా భారతీయ వాస్తు 'రక్తబలి' సిద్ధాంతిని పేర్కొనలేదు. ఈ విధానం శాక్తేయంలో తీవ్రవాదం నుంచి హిందూ వేతరులు అనుసరించారు. ఇది అవసరం కాదు.

*కె.అనితానాయుడు — బెంగుళూరు*

** మాకు వాస్తుపై పెద్దగా నమ్మకం లేదు. రెండు నెలల తర్వాత లిఫ్టులో ప్రమాదం జరిగి వారి కాలు విరిగింది.*

వాస్తును పాటించకపోవడం వల్లే ప్రమాదం జరిగిందని భావించినపుడు ఇప్పటికైనా వాస్తు సరి చేసుకోవడానికి ప్రయత్నించాలి కదా?

*పి.శశికళ — నెల్లూరు*

** పెళ్లయి పద్నాలుగు సంవత్సరాలు. పిల్లలు లేరు.*

మీ శ్రీవారి, మీ పుట్టిన తేదీ సమయాలు, ప్లానులు చూశా. మీరు పుష్యరాగం ధరించి, సుదర్శన యంత్ర ప్రతిష్ట చేశాక 'గర్భం' వచ్చిందంటే మీరు భగవత్కృపకు పాత్రులైనట్లే లెక్క. అయితే గైనకాలజిస్టు పర్యవేక్షణ తీసుకోండి.

*డి.కృష్ణవేణి — ఆత్మకూరు*

** పిల్లలు చదువులో బాగా వెనుకబడిపోయారు. ఏ యంత్రమైతే బాగా పనిచేస్తుంది?*

చదువు, ప్రవర్తన వ్యక్తిగతమైనవి. అందువల్ల వాళ్ల జన్మ తేదీల ప్రకారం నవరత్నధారణ చేయిస్తే సరిపోతుంది.

# ఇందిరమ్మ గృహాల మంజూరు ఇక కఠినతరం!

**నూతన మార్గదర్శకాల ప్రకారం ఇల్లు నిర్మించుకొనేందుకు స్థలం వుండి, అన్ని ధృవీకరణ పత్రాలు అందజేసిన వారిని ఒకటవ కేటగిరిగానూ, రేషన్ కార్డు కలిగి ధృవీకరణ పత్రాలు అందించలేని వారిని రెండవ కేటగిరిగానూ, రేషన్ కార్డు, ఇల్లు నిర్మించుకొనేందుకు స్థలం లేనివారిని మూడవ కేటగిరి గానూ విభజించనున్నారు.**

జిల్లాలో ఇందిరమ్మ గృహాల మంజూరుకు నిబంధనలు కఠినతరం కానున్నాయి. ఇప్పటివరకు ఇందిరమ్మ పథకం క్రింద మంజూరు చేసిన గృహాలను పూర్తి చేస్తారు. కొత్తగా మంజూరు చేసే వాటికి నిబంధనలను కఠినతరం చేస్తూ ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. ఇటీవల జరిగిన రచ్చ బండ కార్యక్రమంలో ఇందిరమ్మ ఇళ్ల మంజూరు కోసం వేలల్లో దరఖాస్తులొచ్చాయి. దరఖాస్తుల పరిశీలనలో వున్న అధికారులకు మార్గదర్శకాలు అందడంతో వివిధ కేటగిరీలుగా విభజించనున్నారు.

ఇప్పటికే మంజూరు చేసిన గృహాలు పూర్తికాకుండా వున్నాయి. ప్రజాప్రతినిధులు, అధికారుల నిర్లక్ష్యం కారణంగానే ప్రారంభించిన గృహాలు అసంపూర్తిగానే దర్శనమిస్తున్నాయి. నూతన మార్గదర్శకాల ప్రకారం ఇల్లు నిర్మించుకునేందుకు స్థలం వుండి, అన్ని ధృవీకరణ పత్రాలు అందజేసిన వారిని ఒకటవ కేటగిరిగానూ, రేషన్‌కార్డు కలిగి ధృవీకరణ పత్రాలు అందించలేని వారిని రెండవ కేటగిరిగానూ, రేషన్‌కార్డు, ఇల్లు నిర్మించుకొనేందుకు స్థలం లేని వారిని మూడవ కేటగిరిగానూ గుర్తించనున్నారు. గతంలో ఇందిరమ్మ పథకం క్రింద ఇల్లు నిర్మించుకొనేందుకు గ్రామసభ ఆమోదం పొందాల్సి వుండేది నూతన మార్గదర్శకాల ప్రకారం పూర్తి అధికారం ఎంపిడిఓలకు ప్రభుత్వం అప్పగించింది.

నూతన మార్గదర్శకాల ప్రకారం దరఖాస్తు చేసుకున్న వారికి ఇల్లు మంజూరు కావడం కష్టతరంగా వుంటుంది. గ్రామీణ ప్రాంతాల్లో ఇల్లు నిర్మాణం కోసం స్థలం కావాల్సిన వారికి రెవెన్యూ అధికారులు భూసేకరణ చేసి ఇవ్వాల్సి వుంటుంది. ఈ కార్యక్రమం పూర్తిచేసి స్థలం అప్పగించేందుకు చాలా సమయం పడుతుంది. ఈ నేపథ్యంలో గృహ నిర్మాణశాఖ అధికారులు ఇల్లు మంజూరు చేయడం వీలుపడదు. దాదాపు ఆరు సంవత్సరాల క్రితం మంజూరు కాబడిన గృహాలు నిధుల కొరత కారణంగా పూర్తికాకుండా వున్నాయి.

ప్రభుత్వం కూడా ఇందిరమ్మ గృహాలకు నిధులు విడుదల చేయకపోవడంతో అధికారులు లబ్దిదారులకు సమాధానం చెప్పలేకపోతున్నారు. పూరిగుడిసె స్థానంలో పక్కా గృహం నిర్మించుకోవాలన్న బడుగు జీవుల ఆశలు నెరవేరకుండా పోతున్నాయి. పక్కా గృహం నిర్మించుకొనేందుకు వున్న పూరిగుడిసెను తొలగించుకున్న వారు ప్రజాప్రతినిధులు, అధికారులను శాపనార్థాలు పెడుతున్నారు. కొంతమంది ఆర్థికస్తోమత కలిగినవారు గృహనిర్మాణశాఖ అధికారులతో నిమిత్తం లేకుండా సొంతంగా పక్కా ఇళ్ల నిర్మాణం పూర్తి చేసుకోగలిగారు.



ఇందిరమ్మ ఇళ్ల మంజూరీలో ఇక ఇబ్బందులు.

అధికారులను నమ్ముకుంటే మరో రెండు, మూడు సంవత్సరాల వరకు కూడా గృహాలు పూర్తయ్యే అవకాశం వుండదని భావించి వారు సొంతంగా పూర్తి చేసుకొనేందుకు సిద్ధమవుతున్నారు. ఈ సంవత్సరం నుంచి ఇందిరమ్మ గృహాలు దరఖాస్తు చేసుకున్న వారందరికి మంజూరు చేసే అవకాశం కనిపించడం లేదు. ఇందుకు కారణం రాష్ట్రప్రభుత్వం నూతన మార్గదర్శకాలను జారీ చేయడమే.

ఆటోలు – జరిమానాలు

# నానా పాట్లు పడుతున్న ఆటో డ్రైవర్లు!



ఆటోలపై పోలీసు ప్రతాపం.

**ఆటోను కొనుగోలు చేసి ఆర్టీఓ కార్యాలయంలో రిజిస్ట్రేషన్ చేయించుకొనే సమయంలో రోడ్డు టాక్స్ చెల్లిస్తారు. ఈ సందర్భంగా 60 కిలోమీటర్ల పరిధిలో ఆటోను నడుపుకోవచ్చంటూ పర్మిట్ కూడా జారీ చేస్తారు. కానీ గ్రామీణ ప్రాంతాలకు వెళ్తుండే ఆటోలను అటు ఆర్టీసి అధికారులతోపాటు ఇటు పోలీసులు కూడా ఆపి జరిమానాలు విధిస్తుంటారు.**

జిల్లావ్యాప్తంగా ఆటో డ్రైవర్లు వివిధ రకాలుగా ఇబ్బందులు పడుతున్నారు. ప్రయాణీకులను ఎక్కించుకొని వెళ్లే సమయంలో అటు ఆర్టీసి అధికారులు, ఇటు పోలీసులు కేసులు నమోదు చేసి జరిమానాలు విధిస్తున్నారు. కుటుంబ పోషణ కోసం ఆటో నడుపుతున్న వారు రోజువారి అద్దె కూడా చెల్లించలేని పరిస్థితి కలుగుతూంది. నెల్లూరు నగరంలో దాదాపు పదివేలకు పైగా ఆటోలు వున్నాయి. ఇవి కాకుండా ఇందుకూరుపేట, ముత్తుకూరు, తోటపల్లిగూడూరు, బుచ్చిరెడ్డిపాళెం తదితర ప్రాంతాల నుంచి మరికొన్ని ఆటోలు నగరంలోకి ప్రయాణీకులను తీసుకొస్తుంటాయి. ఏదో ఒక రూపంలో నిబంధనలను ఉల్లంఘిస్తున్నారన్న కారణంతో 200 రూపాయలు జరిమానాగా పోలీసులు వసూలు చేస్తుంటారు. ఆటోను కొనుగోలు చేసి ఆర్టీఓ కార్యాలయంలో రిజిస్ట్రేషన్ చేయించుకొన్న సమయంలో రోడ్డు టాక్స్ కూడా చెల్లిస్తారు. దీంతో 60 కిలోమీటర్ల పరిధిలో ఆటోను నడుపుకోవచ్చంటూ పర్మిట్ కూడా జారీ చేస్తారు అధికారులు. నిబంధనల ప్రకారం 60 కిలోమీటర్ల పరిధిదాటి ప్రయాణీకులను చేరవేసే ఆటోలకు రవాణాశాఖ అధికారులు జరిమానా విధించే అవకాశం వుంది. అయితే ఆర్టీసి అధికారులకు ఎటువంటి అధికారం లేకున్నప్పటికీ మార్గ మధ్యమంలో ఆటోలను నిలిపి ప్రయాణీకులను దింపివేసి డ్రైవర్లను వివిధ రకాలుగా బెదిరింపులకు గురిచేస్తున్నారని వాపోతున్నారు. ఆర్టీసి బస్సులకు ఆదాయం రావడం లేదన్న సాకుతో ఇటువంటి చర్యలకు పాల్పడడం ఎంతవరకు సమంజసమని ఆటో డ్రైవర్లు ప్రశ్నిస్తున్నారు.

గ్రామీణ ప్రాంతాలకెళ్లే ఆర్టీసి బస్సులు నిర్ణీత సమయానికి వెళ్లకపోవడంతో పనుల నిమిత్తం వెళ్లే వారు ఆటోలను ఆశ్రయిస్తుంటారు. దీంతో బస్సుల్లో ఎక్కే వారి సంఖ్య తగ్గిపోయి ఆర్టీసి ఆదాయానికి కొంతమేర గండి పడడం సహజం. బస్సులను నిర్ణయించిన సమయానికి నడపలేని ఆర్టీసి అధికారులు ప్రయాణీకులను తీసుకెళ్లే ఆటోలను మార్గమధ్యమంలో నిలిపి ప్రయాణీకులను ఇబ్బందులకు గురి చేస్తుంటారు. ఆర్టీసి అధికారుల వైఖరిని ప్రశ్నిస్తే పోలీస్‌స్టేషన్‌కు రప్పిస్తుంటారని కొందరు డ్రైవర్లు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. దీంతో ఎందుకొచ్చిన తంటా అనుకొని మౌనంగా వుండిపోక తప్పడం లేదంటున్నారు ఆటో డ్రైవర్లు.

ఇకపోతే నెల్లూరు నగరంలో పోలీసుల వైఖరితో ఆటో డ్రైవర్లు విసిగిపోతున్నారు. వాహనదారుల నుంచి జరిమానాలు వసూలు చేయాలని అనిపిస్తే చాలు క్షణాల్లో వాహనాలను నిలిపి పలు రకాల ప్రశ్నలు వేసి విసిగించి జరిమానాలు వసూలు చేస్తున్నారు. ప్రధానంగా ఆటోలపై వీరి ప్రభావం ఎక్కువగా వుంటుంది. ఆటో డ్రైవర్లకు యూనియన్ వున్నప్పటికీ వీరు ఎదుర్కొంటున్న సమస్యలపైగానీ, సంక్షేమంపైగానీ ఏమాత్రం యూనియన్ ప్రతినిధులు దృష్టిసారించలేక పోతున్నారు. పోలీసులు, ఆర్టీసి అధికారుల వలన రోజు వారి ఆటో అద్దె కూడా చెల్లించలేని పరిస్థితిలో డ్రైవర్లు వున్నారు. ఒక రోజు అద్దె చెల్లించకుంటే మరుసటి రోజు ఆటో అద్దెకు దొరకదు. కుటుంబ పోషణ కోసం ఈ వృత్తిని ఎంచుకొన్న వారిలో ఉన్నత చదువులు చదివిన వారూ వున్నారు.

ఆటోలలో 60 కిలోమీటర్ల పరిధిలో ప్రయాణీకులను చేరవేసేందుకు అన్ని అనుమతులున్నప్పటికీ అనవసరంగా ఆర్టీసి అధికారులు ఇబ్బందులకు గురి చేయడంపై ప్రజలు కూడా ప్రశ్నిస్తున్నారు. ఈ అధికారులు వ్యవహరిస్తున్న తీరుపై ఎవరికి ఎలా విన్నవించుకోవాలో తెలియక సతమతమౌతున్నారు ఆటో కార్మికులు.

# కమర్షియల్ తారను కాను!



అవార్డులొచ్చినా తీసుకోని నటులు కొందరున్నారు. అమీర్, సల్మాన్ ఖాన్‌లు అవార్డులిస్తామన్నా కూడా ఎవరినీ పట్టించుకోరు. ఈ బాటనే నడుస్తానంటుంది హీరోయిన్ సమంత. అవార్డులు అందుకునేంత నటన ఏమీ కనబర్చకపోయినా సమంత ఇప్పుడున్న చాలా మంది హీరోయిన్లకంటే బెటర్ నటి అని 'ఏమాయ చేసావె' చిత్రం ద్వారా నిరూపించింది. కాని ఆమె మాత్రం అవార్డులకు తాను వ్యతిరేకమని ప్రకటించింది. ఎన్టీఆర్, మహేష్‌బాబులతో నటించే అవకాశాలొచ్చినా కూడా 'ఈగ' లాంటి ప్రయోగాత్మక సినిమాలో నటిస్తూ సమంత తాను కమర్షియల్ టైపు కాదని చాటి చెప్పింది. ఇక అవార్డులకు కూడా దూరమంటూ తనది డిఫరెంట్‌మైండ్ అని చెప్పకనే చెబుతోంది.

# వ్యాపారాల్లో బిజీ



సొట్టబుగ్గల సుందరి ప్రీతిజింటాను తెలుగు ప్రేక్షకులు అంత త్వరగా మర్చిపోరు. దీనికి ఆమె నటించిన 'ప్రేమంటే ఇదేరా' చిత్రం కారణం. వెంకటేష్‌కు జోడిగా ఈ చిత్రంలో నటించిన ప్రీతిజింటాకు బాలీవుడ్‌లోనూ డిమాండ్ తగ్గింది. ఐపిఎల్ క్రికెట్ మ్యాచ్‌లలో ఓ స్వంత జట్టు వున్నా ఈ హీరోయిన్ వ్యాపారాల్లో బిజీగా వుంది. ఈ విషయమై ఇటీవల హైదరాబాద్ వచ్చిన ఆమె వివరిస్తూ కెరీర్‌లో ఎన్నో ఎత్తుపల్లాలు చూశాను. కష్టాలు వచ్చినపుడు ఎప్పుడూ భయపడి పారిపోలేదు. వ్యాపారాలలో వున్నానని సినిమాను వదిలేయను. వ్యాపారాలు, సినిమాల్లో దేన్ని ఎంచుకోవాలో తెగ ఆలోచిస్తున్నానని బీరాలు పలికింది.

# నేను సెక్సీ భామనే!



రామ్‌చరణ్ సరసన ఆరెంజ్ చిత్రంలో నటించిన హీరోయిన్ షాజన్ పదమ్‌సీకి ఎందువల్లో అంత గుర్తింపు రాలేదు. వస్తుందన్న ఆశాభావంలో ఆమె వుంది. తన గూర్చి వివరాలు చెబుతూ నాదో అందమైన పేరు. దీని అర్థం గ్రహదేవత. అమ్మానాన్న పేర్లను కలిపి షాజన్ పదమ్‌సీ అని పెట్టారు. వారు పెట్టిన పేరుకు పేరు తేవాలని ప్రయత్నిస్తున్నాను. ఈ మధ్య ఒక పురుషుల పత్రిక ముఖచిత్రంగా నా ఫోటోను ప్రచురించారు. అది చూసి అందరూ సెక్సీగా వున్నానని చెబుతున్నారు. ఆ ఫోటో చూడగానే నాక్కూడా అందంగా వున్నానని అనిపించింది. నాకళ్లు, శరీరాకృతే సెక్సీభామను చేశాయని చెప్పుకొచ్చింది.

# అవకాశమివ్వండి!



ముమైత్‌ఖాన్ తెలుగు పరిశ్రమలో ఐటమ్‌రాణిగా అడుగుపెట్టింది. కొన్ని చిత్రాల్లో ముఖ్య భూమిక పోషించింది. ఫైట్లు చేసింది. గోలీమార్‌లో పాట కూడా పాడింది. ఇప్పుడేమో అవకాశం ఇస్తే తనను తాను కొత్తగా ఆవిష్కరించుకోను రెడీ అంటుంది. హైదరాబాద్‌లో చిట్‌చాట్‌గా మాట్లాడుతూ తెలుగులో సినిమాలెందుకు తగ్గాయో అర్థంకావడం లేదు. నేను అవసరం అనుకొంటే అడక్కుండానే అవకాశం ఇస్తారు. ఇష్టం లేకపోతే అమాంతంగా పారితోషికం పెంచేసిందంటారు. నేను పారితోషికం అమాంతంగా పెంచలేదు. నిర్మాతలే డిమాండ్ రీత్యా ఇచ్చారు. నాకే కాదు ఏ ఆర్టిస్టుకైనా ఇలాగే ఇస్తారు. కన్నడంలో నటించిన 'పంచావతారం' ఇక్కడ విడుదల కాగానే అవకాశాలు వస్తాయి. తమిళంలోనూ నటిస్తున్నాను. ఎవరైనా అవకాశమిస్తే ఒక సినిమాకు కూడా దర్శకత్వం వహిస్తానని ముమైత్ తన మనసులో మాట చెప్పింది.

# రాణించలేకపోయాను



బుజ్జిగాడు చిత్రంలో తెలుగు తెరపై తళక్కున మెరిసిన అమ్మడు 'సంజన'కు ఆతర్వాత పెద్దగా గుర్తింపు లేకుండా పోయింది. కన్నడ చిత్రాలలో బిజీగా వున్న సంజన శ్రీకాంత్ హీరోగా నటిస్తున్న దుశ్శాసన చిత్రం షూటింగ్ గ్యాప్‌లో మాట్లాడింది. బుజ్జిగాడు తర్వాత తెలుగులో ఎన్నో అవకాశాలు వచ్చాయి. మొదట్లో నాక్కొన్ని కథలు నచ్చలేదు. కొన్నింట్లో కథలు నచ్చినా అందులో నాపాత్రలు సంతృప్తికరంగా అనిపించలేదు. ఇంతలోనే కన్నడలో పలు అవకాశాలు చేతికొచ్చాయి. దీంతో అక్కడే బిజీగా గడపాల్సొచ్చింది. తెలుగు ప్రేక్షకులు నన్ను మరచిపోకూడదని అప్పుడప్పుడు ఇక్కడ కొన్ని చిత్రాలు చేస్తూ వచ్చాను. అవి అనుకొన్నంత విజయాలను అందించలేకపోయాయి. దుశ్శాసన చిత్రం ఆ కొరత తీరుస్తుందన్న ఆశాభావాన్ని సంజన వ్యక్తం చేసింది.

# నేను... నా రాక్షసి బోర్!



అల్లూరు రహీం

తెలుగు సినిమా తెరపై కొత్త కథలు రావడంలేదు... తీయడం లేదు అని పదే పదే అంటుంటే తిక్కరేగి వ్రాసిన కథ అని దర్శకుడు పూరి జగన్నాథ్ ప్రకటించిన కథతో తయారైన చిత్రమే నేను.... నా రాక్షసి. నిర్మాత నల్లమలుపు బుజ్జి లక్ష్మీనరసింహ ప్రొడక్షన్ బ్యానర్‌పై దీనిని తెరకెక్కించారు. ఆత్మహత్యల నేపథ్యంలో ఈ చిత్రం కొనసాగుతుంది. దర్శకుడు పూరి జగన్నాథ్, హీరో రానా, హీరోయిన్ ఇలియానా హిట్ కోసం పరితపిస్తూ చేసిన ఈ ప్రయోగాత్మక చిత్రం ప్రేక్షకులను అంతగా అలరించలేదనే చెప్పాలి. పూరి జగన్నాథ్ ఈ కథ వ్రాయడానికి ఏ ఇంగ్లీషు చిత్రమో చూసి స్ఫూర్తి పొందినట్లున్నాడు. ఆయనే వ్రాసిన స్క్రీన్‌ప్లే పరవాలేదనిపించినా ముమైత్‌ఖాన్, అలీ కాంబినేషన్‌లో నడిపిన బూతు సన్నివేశాలు, మాటలు, కుటుంబ సమేతంగా సినిమాకు వెళ్లినవారిని, యువతను కూడా ఇబ్బంది పెడతాయి. ఓ కాఫీ బార్‌కు వచ్చిన ముమైత్ పది మంది ముందు అలీ ప్యాంట్ విప్పేస్తుంది. విమాన ప్రయాణంలో అలీని బ్లాక్ మెయిల్ చేయను అభ్యంతరకరమైన కలయికలతో ఫోటోలు తీస్తుంది. అలీ సైతం సైగల ద్వారా కొన్ని వికారాలకు పాల్పడుతాడు. విలన్ అభిమన్యు సింగ్ ఓ చోట హీరోయిన్ శరీర కొలతలను వెల్లడించే తీరు అసహ్యంగా వుంది. అయితే ఈ చిత్రానికి పాటలు ప్రాణం పోశాయి. విశ్వ – రెహమాన్ వ్రాసి సంగీతం కూర్చిన నాలుగు పాటల్లో మళ్లీ మళ్లీ మెరుపులా, వయ్యారి నిను చూడాలని, మీనాక్షి ఓడ్గా మీనాక్షి బాగున్నాయి. ముమైత్‌ఖాన్‌పై చిత్రీకరించిన ఐటమ్ పాట పాపం... పుణ్యంను విదేశీ పబ్బుల్లో పాటలా చిత్రీకరించారు. దర్శకుడే వ్రాసిన మాటలు కూడా మరీ పచ్చిగా వున్నాయి. ఐ లవ్ యూ అంటే ఏమడిగినా ఇవ్వాలి. నిన్ను ప్రేమిస్తున్నాను... నీతో పడుకోవాలని వుంది. మొహమాటానికి పోతే కడుపు వస్తుంది ఈ కోవలోనివే. వెనిస్ అందాలను కెమెరామెన్ అమోల్ రాథోడ్ చక్కగా చిత్రీకరించాడు. హీరోయిన్ క్యారక్టరైజేషన్ వింతగా వుంటుంది కాబట్టి ఇలియానా అందాల ప్రదర్శనకు చిత్రంలో అవకాశం లేకుండా పోయింది. హీరో రాణా ప్రొఫెషనల్ కిల్లర్‌గా బాగున్నాడు కానీ, ప్రేమికునిగా పర్‌ఫెక్ట్‌గా లేడు. రక్తచరిత్ర ఫేం విలన్ అభిమన్యుసింగ్ చేత నటనను రాబట్టడంలో దర్శకుడు విఫలమయ్యాడని చెప్పొచ్చు.

చిత్రకథలోనికి వెళ్తే అభిమన్యు (రానా) ప్రొఫెషనల్ కిల్లర్. మంచి షూటర్ అయిన ఆయన గతంలో ఒలంపిక్స్‌లో కూడా పాల్గొన్న వ్యక్తి. రత్నా (అభిమన్యు సింగ్) అభిమన్యు ఓ మంత్రిని కాల్చాలని శిక్షణలో వుండగా అతడ్ని వెనక్కు రప్పించమని అతని తల్లిదండ్రులపై ఒత్తిడి చేస్తాడు. వాళ్లు దీనికి ఒప్పుకోకపోవడంతో వాళ్లిద్దరినీ కాల్చి చంపేస్తాడు. దీంతో అభిమన్యు తన తల్లిదండ్రులను చంపిన వారి కోసం వెతుకుతూ నేర సామ్రాజ్యంలో కొనసాగుతుంటాడు. ఓ కాఫీ బార్‌లో వెండర్‌గా పనిచేసే మీనాక్షి (ఇలియానా) అభిమన్యును ఆకర్షిస్తుంది. కాని ఆమె వింత మనస్తత్వం గల వ్యక్తి. నెట్ కాన్ఫరెన్స్‌లో ఆత్మహత్యలు చేసుకోవాలన్న వ్యక్తులతో నేరుగా మాట్లాడి వారి ఆత్మహత్యలను వీడియోలో చిత్రీకరించి యూ ట్యూబ్‌లో పెట్టి ప్రపంచానికి తెలియజేస్తుంది. ఈ విషయమై సిఐ విక్రమ్ (సుబ్బరాజు) దర్యాప్తు మొదలు పెడతాడు. అభిమన్యు ఆమెను ప్రేమించమని వెనుకబడుతుంటే నేను పదిహేను రోజుల్లో ఆత్మహత్య చేసుకొని చనిపోతానని చెబుతుంటుంది. మోహన్‌దాస్(రామినీడు), అతని సోదరుడిని అభిమన్యు కాల్చి చంపడంతో జైలు నుంచి వచ్చిన రత్నా రెచ్చిపోతాడు. అభిమన్యు కోసం వెతుకులాట ప్రారంభిస్తాడు. మీనాక్షిపై నిఘా పెరగడంతో అనుకోని పరిస్థితులలో హీరో, హీరోయిన్లు వెనిస్‌కు వెళ్లిపోతారు. అక్కడకూడా చాలాసార్లు హీరో నన్ను ప్రేమించవే రాక్షసి అంటాడు. ఆ సమయంలో ఆమె తన అక్క బాహ్య (ఇలియానా) నాన్న (కోట శ్రీనివాసరావు) ఆత్మహత్య చేసుకొన్న కారణాన్ని వివరించి లోకానికి ఆత్మహత్యలు చేసుకొన్న వారి బాధలు యూ ట్యూబ్‌లో తెలియజేస్తున్నానంటుంది. ప్రపంచంలోని అత్యంత విషాదకరమైన ఆత్మహత్యలు చేసుకొనే ప్రదేశంలో మీనాక్షి ఆత్మహత్య చేసుకొంటుంది. దీన్ని చూసి తట్టుకోలేని అభిమన్యు తుపాకితో కాల్చుకొంటాడు. చివరికి సిఐ విక్రమ్ సంఘటనా స్థలానికి వచ్చి వీరిని హాస్పిటల్‌కు తరలించి రక్షించడంతో చిత్రం ముగుస్తుంది.

చిత్ర సమీక్ష

# రాజకీయ సందడేది?

జిల్లా రాజకీయాల్లో స్తబ్దత నెలకొంది. గత కొంత కాలంగా విమర్శలు, ప్రతి విమర్శలతో వేడెక్కి వుండిన రాజకీయం కాస్త కడప ఎన్నికల పుణ్యమాఅని చల్లబడిపోయింది. అధికార కాంగ్రెస్ పార్టీతోపాటు, ప్రతిపక్ష తెలుగుదేశం, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నేతలందరూ కడప ఎన్నికలపైనే దృష్టిసారించడంతో జిల్లాలోని నాయకులందరూ అక్కడే మకాంపెట్టి వున్నారు. వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నేతలైన మేకపాటి సోదరులు, మాజీ ఎమ్మెల్యే విష్ణువర్ధన్‌రెడ్డి, కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి తదితరులందరూ కడప ఎన్నికల్లో తలమునకలై వున్నారు. టిడిపి నుంచి సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి, బీద రవిచంద్ర తదితరులు అక్కడే వున్నారు. మరో వైపు కాంగ్రెస్ పార్టీ మంత్రులు, శాసనసభ్యులు ఈ ఎన్నికలను ప్రతిష్టాత్మకంగా తీసుకొని అక్కడే మకాం పెట్టి వుండడంతో జిల్లా రాజకీయాలు స్తబ్దుగా వున్నాయి. మొన్న జరిగిన ఎమ్మెల్సీ ఎన్నికలు, ఆ తర్వాత జగన్ పార్టీ నేతలైన మేకపాటి సోదరులు, ఆనం సోదరుల నడుమ నడిచిన విమర్శలు, వీటి మధ్య జిల్లా పరిషత్ నూతన కార్యాలయ భవనాన్ని ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి గుట్టుచప్పుడు కాకుండా ప్రారంభించడం, ప్రోటోకాల్ వివాదాలతో నిత్యం వాడివేడిగా వుండిన రాజకీయం కాస్త కడప ఎన్నికలతో చల్లబడిపోయింది. ఈ ఎన్నికల తర్వాత కాంగ్రెస్ పార్టీలో వుంటూ జగన్ పక్షాన చేరిన వారిపై వేటు, కోవూరు శాసనసభ్యుడు ప్రసన్నపై క్రమశిక్షణ చర్యలు తీసుకొనే అవకాశం వుండడంతో తిరిగి జిల్లా రాజకీయాలు రంజుగా మారనున్నాయి. అప్పటి వరకు కొంత స్తబ్దుగా వుండబోతాయి.

## అన్ని పార్టీల నేతలు కడపలో మకాం ఫలితం

# వేసవి తాపాన్ని తీర్చిన స్వరఝురి

## • ఆకట్టుకొన్న పాడుతాతీయగా పిల్లలు



కస్తూరిదేవి గార్డెన్స్‌లో పాటకచ్చేరి నిర్వహిస్తున్న చిన్నారులు.

వేసవి తాపానికి అల్లాడిపోతున్న నగర వాసులకు నగరంలోని కస్తూరిదేవి గ్రౌండ్స్‌లో జరిగిన సంగీత కార్యక్రమం సేదతీర్చింది. విఖ్యాత గాయకుడు ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం నిర్వహిస్తున్న పాడుతాతీయగా కార్యక్రమంలో విజేతలుగా నిలచి ఎందరో అభిమానాన్ని సంపాదించుకొన్న చిన్నారులతో సంగీత ఝురి పేరిట నిర్వహించిన సంగీత కార్యక్రమం సంగీత ప్రియులందరినీ కొంత సేపు తన్మయత్వంతో మరిపించింది. ఈటీవీ పాడుతాతీయగా విజేతలుగా నిలచిన లక్ష్మీమేఘన, అంజలీ నిఖిల, గణేశ్ రేవంత్, రాఘవేంద్రలు తమ గాత్ర మాధుర్యంతో ఓలలాడించారు. కళాంజలి సాంస్కృతిక సంస్థ వార్షికోత్సవం సందర్భంగా జరిగిన ఈ కార్యక్రమంలో పాడుతాతీయగా దర్శకుడు ఎన్‌బిశాస్త్రి, అసిస్టెంట్ డైరక్టర్ గాయత్రి, సర్ణభారత్ ట్రస్టీ దీపావెంకట్, నక్షత్ర బిల్డర్స్ అండ్ డెవలపర్స్ అధినేత బ్రహ్మారెడ్డి, కళాంజలి సంస్థ నిర్వాహకుడు అనంత్, మురళీకృష్ణహజరత్‌బాబు తదితరులు పాల్గొన్నారు.


రామలింగాపురంలో జరుగుతున్న రోడ్డు విస్తరణ పనులు.

# ముత్తుకూరు రోడ్డు పనులు ప్రారంభం

నెల్లూరు నగరంలోని రామలింగాపురం అండర్ బ్రిడ్జి నుంచి కాకుపల్లి వరకు చేపట్టాల్సిన రోడ్డు విస్తరణ పనులు ఇటీవల ప్రారంభమైనాయి. 20 కోట్ల రూపాయలు రోడ్డు విస్తరణ పనుల కోసం ఖర్చు చేయనున్నారు. దాదాపు సంవత్సరం నుంచి రోడ్డు విస్తరణ పనులు రాజకీయ కారణాలతో వాయిదా పడుతూ వచ్చాయి. ప్రస్తుతం రామలింగాపురం వద్ద రోడ్డు విస్తరణ జరుగుతుంది. నాలుగు లైన్ల రోడ్డు నిర్మాణం పనులు చేపట్టాలని ఎప్పుడో నిర్ణయించింది ప్రభుత్వం. ఇందుకు అవసరమైన సర్వే పూర్తి చేయించడంతోపాటు నిధులు కూడా మంజూరైనాయి. మునిసిపల్ కార్పొరేషన్, ట్రాన్స్‌కో, బిఎస్ఎన్ఎల్ శాఖలకు చెందిన పైపులైన్లు, టెలిఫోన్ స్తంభాలు, విద్యుత్ స్తంభాలను తొలగించే పనిలో సిబ్బంది నిమగ్నమై వున్నారు. రెండు వైపుల నుంచి వచ్చే వాహనాలను దారి మళ్లించక పోవడంతో విస్తరణ పనుల కారణంగా రాకపోకలకు తరచూ అంతరాయం ఏర్పడుతుంది. రోడ్లు, భవనాల శాఖ ఆధ్వర్యంలో చేస్తున్న విస్తరణ, నిర్మాణ పనులు త్వరితగతిన పూర్తి చేయాలని ప్రజలు కోరుతున్నారు.



# ఊపందుకొన్న నీళ్ల వ్యాపారం

ఈ వేసవి కాలంలో తాగునీటి వ్యాపారం ఊపందుకొంది. బోర్లు, బావులు, మునిసిపల్ కార్పొరేషన్ కొళాయిల నుంచి సక్రమంగా తాగునీరు సరఫరా కాకపోవడంతో తాగునీటి క్యాన్లను కొనుగోలు చేస్తున్నారు. ఇప్పటివరకు కేవలం పట్టణ ప్రాంతాలకే పరిమితమైన తాగునీటి క్యాన్ల వ్యాపారం గ్రామీణ ప్రాంతాలకు విస్తరించిపోయింది. గ్రామీణ ప్రాంతాల్లో విద్యుత్‌కోత కారణంగానూ, పైపులైన్ల లీకేజి కారణంగా తాగునీరు సరఫరాలో తీవ్ర అంతరాయం కలుగుతుంది. ఈ క్రమంలో సామాన్య ప్రజలు సైతం తాగునీటి క్యాన్లను కొనుగోలు చేయక తప్పడం లేదు. వివిధ కంపెనీల పేర్లను బట్టి క్యాన్లను విక్రయిస్తున్నారు. ప్రతిరోజు వాహనాల ద్వారా తాగునీటి క్యాన్లను ఇళ్ల దగ్గరకే తెచ్చి అందించడంతో వీటిపై ప్రజలు మొగ్గు చూపుతున్నారు. ప్రజల అవసరాలను ఆసరా చేసుకొంటున్న కొందరు వ్యాపారులు కొళాయిలు, బోర్ల నుంచి క్యాన్లలో నీటిని నింపి అనంతరం సీలువేసి సందట్లో సడేమియా అన్న చందంగా విక్రయించేస్తున్నారు. తాగునీటి వాటర్ ప్లాంట్లపై సంబంధిత అధికారులు నియంత్రణ లేకపోవడమే ఇందుకు కారణం అని భావించవచ్చు.

# నిబద్ధత గల పత్రిక "జమీన్‌రైతు"!

జిల్లాలో 80 సంవత్సరాల నుంచి వెలువడుతున్న "జమీన్‌రైతు" వార పత్రిక విశిష్టత గురించి విశాలాంధ్ర మాజీ సంపాదకులు కె.రాఘవాచారి జర్నలిస్టులకు వివరించారు. ఏప్రెల్ 29, 30 తేదీలలో రెండు రోజులపాటు నగరంలో జడ్పీ సమావేశ మందిరంలో జర్నలిస్టులకు శిక్షణా తరగతులు జరిగాయి. ఈ శిక్షణా తరగతులకు హాజరైన రాఘవాచారి పత్రికా విలువలు – రాజ్యాంగం అనే అంశంపై మాట్లాడారు. ఈ సందర్భంగా నెల్లూరు నుంచి వెలువడుతున్న "జమీన్‌రైతు" పత్రిక గురించి నేటి జర్నలిస్టులు పూర్తిగా తెలుసుకోవాలన్నారు. దాదాపు 80 సంవత్సరాల నుంచి ఈ పత్రిక నడుస్తుందని, పత్రికా విలువలు కాపాడడంలో యాజమాన్యం కట్టుబడి వుందని గుర్తు చేశారు.



పునశ్చరణ తరగతుల్లో మాట్లాడుతున్న జిల్లా కలెక్టర్ శ్రీధర్. వేదికపై రాఘవాచారి, విశ్వేశ్వరరావు తదితరులు.


నెల్లూరు జైన్‌గోల్డ్ షోరూం తమ వద్ద బంగారం కొనుగోలు చేసిన ఖాతాదారులకు వారం వారం నిర్వహిస్తున్న లక్కీడ్రాలో విజేత లక్ష్మీ ప్రసూనకు స్కూటీని అందజేస్తున్న మాజీ కార్పొరేటర్ పుట్టా రామకృష్ణారెడ్డి. ప్రక్కన షోరూం అధినేతలు మణిలాల్ జైన్, నరేంద్రజైన్.

## ఒసామా బిన్ లాడెన్

16వ పేజీ కొరవ

పుట్టడం మొదలైంది. ఆ కలవరంలో వారు మానవత్వం మరిచిపోయి, ఆఫ్ఘనిస్తాన్ పైనా, ఇరాక్ పైనా, ఇతర ముస్లిం దేశాలపైనా యుద్ధ దురహంకారం ప్రదర్శించారు. పసిపిల్లలు, ఆడవాళ్లు అని కూడా చూడకుండా కొన్ని లక్షల మందిని కిరాతకంగా చంపారు. 2002లో అమెరికన్ ప్రభుత్వానికి నేరుగా ఒక లేఖ వ్రాస్తూ, అమెరికన్ల మీద తానెందుకు జీహాద్ జరుపుతున్నదీ సవివరంగా వివరించి చెప్పాడు ఒసామా.

### ఎంత ఖర్చు పెట్టించాడో?

ఒసామాను వెతికే ప్రయత్నంలో అమెరికన్ ప్రభుత్వం ఎన్ని లక్షల కోట్ల రూపాయలు ఖర్చు పెట్టిందో లెక్క లేదు. దేశాలకు దేశాలను జల్లెడపట్టి గాలించినా వారికి ఒసామా దొరకలేదు. పది కంటే ఎక్కువ సార్లు, అమెరికన్ సైన్యాధికారులు తాము ఒసామాను చంపివేసినట్లు ప్రకటించారు. కానీ, వారి చేతకాని తనాన్ని వెక్కిరిస్తూ జాబులు, ఆడియో క్యాసెట్లు, వీడియో ఫిల్మ్‌లు విడుదల చేసేవాడు. దాదాపు పన్నెండేళ్ల నిర్విరామ శ్రమ తర్వాత, పాకిస్తాన్‌లో అబోటాబాద్‌లో అమెరికన్ సైనికులకు చిక్కిపోయాడు ఒసామా. ఒక్క క్షణం ఆలస్యం చేయకుండా ఆయన్ను కాల్చి చంపడంతో పాటు, ఆయన శవం ఆనవాళ్లు కూడా మిగలకుండా అరేబియా సముద్రంలో ముంచి వేశారు అమెరికన్లు. ఒసామా శవాన్ని చూసి కూడా అంతగా వణికి పోయారు వారు.

### ముస్లింలకు తుది సందేశం

ఒసామా తీవ్రవాది కావచ్చు. బాంబులతో హింస సృష్టించి వుండవచ్చు. ఆయనలో మత మౌఢ్యం ముదిరిపోయి వుండవచ్చు. కానీ ఆయన సాగించిన జీహాద్‌కు అమెరికన్ సమాజం మాత్రం అన్ని విధాలా అర్హమైనదని చెప్పక తప్పదు. సామ్రాజ్య వాద కాంక్షతో, క్రైస్తవ మత పిచ్చితో వారు ప్రపంచం మొత్తం మీద చేస్తున్న, చేయిస్తున్న అరాచకాలను ప్రతిఘటించడానికి ఒసామా వంటి యోధులు ఎప్పుడూ అవసరమే. తమ సుఖం కోసం పేద దేశాల ప్రజలను ఆకలి చావులకు గురి చేసే క్రూరమైన పోకడ అమెరికన్ పాలకులది. "నేను అమెరికన్ సైనికుల చేతిలో చనిపోయిన తర్వాత, ప్రపంచ ముస్లిందరూ చైతన్య వంతులై ఇస్లాం అంతానికి ప్రయత్నిస్తున్న అమెరికాను ఓడించాలని" తన అంతిమ సందేశంలో విజ్ఞప్తి చేశాడు ఒసామా.

అమెరికా వద్ద అత్యంత ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం, సమాచార వ్యవస్థ వున్నాయి. వారి ఉపగ్రహ వ్యవస్థ అసాధారణమైనది. భూగోళం మొత్తం మీద ఎక్కడైనా సరే, ఒక అడుగు విస్తీర్ణంలో చిన్న పాటి కదలికలను కూడా ఫోటో తీయగలవవి. అంతటి శక్తిమంతులు, ఒసామాను పట్టుకోవడం చేతకాక పన్నెండేళ్లపాటు కొన్ని లక్షల కోట్ల రూపాయలు ఖర్చు పెట్టుకోవడం విచిత్రం. సింహాన్ని ఆట ఆడించిన చిట్టెలుక వలె చరిత్రలో చిరస్థాయిగా నిలిచి పోతాడు ఒసామా బిన్ లాడెన్.

### భారత పాకిస్తాన్‌ల మధ్య అణుయుద్ధం కోసం కుట్ర

ఒసామా బిన్ లాడెన్‌కు భారతదేశం పట్ల కూడా సదాభిప్రాయం లేదు. ఇజ్రాయిలీలతో కలిసి ఇస్లాం ప్రపంచానికి వ్యతిరేకంగా కుట్ర పన్నే వారిలో హిందువులూ ఒకరన్నది లాడెన్ అభిప్రాయం. 1990 దశకంలో, సుడాన్‌లో తలదాచుకొన్న సమయంలోనే బిన్ లాడెన్ కాశ్మీర్ తీవ్రవాదులకు శిక్షణ ఇచ్చేవాడని చెప్తారు. 1998లో తాను స్థాపించిన తీవ్రవాద వ్యవస్థలో కాశ్మీర్ తీవ్రవాద సంస్థ హర్కత్ ఉల్ ముజాహిదీన్‌ను కలుపుకొన్నాడు. లష్కరే ఏ తొయిబా, జైషే మొహమ్మద్ సంస్థలతో కూడా లాడెన్‌కు గట్టి సంబంధాలున్నాయి. వీరికి తరచూ ధన సహాయం చేసేవాడని చెప్తారు.

తాలిబన్‌లకు శిక్షణ ఇచ్చే మదరసాలలో కాశ్మీర్ తీవ్రవాదులకూ ప్రవేశం కల్పించాడు. అమెరికాపై తాను జరుపుతున్న జీహాద్ పోరుకు, అమెరికన్ ప్రభుత్వం కాశ్మీర్ విషయంలో భారత దేశానికి మద్దతు పలకడం కూడా ఒక కారణమని అమెరికన్ ప్రజలకు వ్రాసిన బహిరంగ లేఖలో ప్రకటించాడు బిన్ లాడెన్.

భారత్, పాకిస్తాన్‌ల మధ్య అణు యుద్ధం సృష్టించాలని కూడా ప్రయత్నించాడు బిన్ లాడెన్. దానివల్ల ఈ ప్రాంతంలో రాజకీయ అస్థిరత ఏర్పడి, ఆఫ్ఘనిస్తాన్ సరిహద్దులలోని అల్‌ఖైదా శిబిరాలపై పాకిస్తాన్ సైన్యం ఒత్తిడి తగ్గిపోతుందన్నది వ్యూహం.



## అతి విశ్వాసం

మొదటి పేజీ కొరవ

బదులు తెలుగు దేశానికి రెండవ స్థానం దక్కేట్లు చూడాలన్నది ఆయన వ్యూహం. కాంగ్రెస్‌ను మూడవ స్థానానికి నెట్టిపారేయగల్గితే, రాష్ట్రం మొత్తం మీద కాంగ్రెస్ కార్యకర్తలలో నిరాశ ఆవరించి, రేపటి ఎన్నికల నాటికి నామ రూపాలు లేకుండా పోతుందన్నది జగన్ ఆశ. అది ఆశో దురాశో ఇప్పుడే చెప్పలేము. కానీ ఆయన మాత్రం ఆ కలే కంటున్నాడు. ఆంధ్రప్రదేశ్ రాజకీయాలను తన గుప్పెట్లో పెట్టుకోవాలన్న కోరిక తీరాలంటే ఈ ఉప ఎన్నికలలో కాంగ్రెస్‌ను చావు దెబ్బ తీయాలన్నది జగన్ లక్ష్యం.

### ముఖ్యమంత్రి దిగులు

ఈ పరిణామాలు ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డిలో దిగులు పుట్టిస్తున్నాయి. జగన్‌ను ఓడించడం లేకుంటే కనీసం మెజార్టీ తగ్గించడం ఆయనకు తప్పనిసరి. అందులో విఫలమైతే అధిష్టానం దగ్గర తలదించుకోవాల్సి రావడం ఒక బాధ. ప్రభుత్వాన్ని పడగొడతానని జగన్ చేసిన సవాలును ఎదుర్కోవడం మరొక సమస్య. జగన్ ఆ మాట ఎందుకన్నాడో తెలియదు. అది కేవలం పిల్ల చేష్టా లేక ఏదైనా లోలోపల మంత్రాంగం వుందా అన్నది తెలియదు. సగం మంది మంత్రులు జగన్‌తో లోపాయకారీ సంబంధం పెట్టుకొని వున్నారని జరుగుతున్న ప్రచారం నిజమైతే, ప్రభుత్వానికి గడ్డు రోజులు తప్పవు.

ఎన్నికలలో ఫలితం ఎట్లా వచ్చినా ప్రభుత్వాన్ని నిలబెట్టుకోవడానికి గట్టి కసరత్తే చేయక తప్పదు. కాంగ్రెస్‌లో కొనసాగుతున్న ఎమ్మెల్యేలు, మంత్రులను కాపాడుకోవడంతో పాటు, జగన్ వెంట నడుస్తున్న ఎమ్మెల్యేలను రాబట్టుకోవాలన్న ప్రయత్నం కూడా జరుగుతున్నది.

### ఆదినారాయణరెడ్డి జారుకొంటాడా?

జగన్ పక్షంగా వీరోచిత ఎన్నికల సమరం చేస్తున్న జమ్మలమడుగు ఎమ్మెల్యే ఆదినారాయణరెడ్డి, ఎన్నికలు కాగానే ముఖ్యమంత్రి పక్షం వెళ్లిపోతారన్న వార్త ఒకటి విన్పిస్తున్నది. జగన్‌తో ఆయనకున్న సంబంధాలు రోజురోజుకూ క్షీణిస్తున్నాయని, ఉప ఎన్నికల వరకు తన బాధ్యతగా భావించి, ఆ వెంటనే కాంగ్రెస్‌లోకి జారుకొంటాడని చెప్తున్నారు. అదే జరిగితే, కడప జిల్లాలో జగన్‌తో కలిసి వుండే ఎమ్మెల్యేల సంఖ్య రెండంటే రెండుకు దిగజారి పోతుంది.

---

## జనవాణి

2వ పేజీ కొరవ

మతానికో, ప్రాంతానికో, రాజకీయ ఆధిపత్యానికో చెందినది కాకపోవడమే ముఖ్య కారణమనవచ్చు.

*పి.రమణయ్య* *దామవరం*

### గుడిపల్లిపాడులో ఇళ్లు కట్టించండి!

నెల్లూరు రూరల్ మండలంలోని గుడిపల్లిపాడు ఆదర్శ గ్రామం. గ్రామం లోని 70 మందికి సర్వేపల్లి ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి ఇందిరమ్మ పథకం క్రింద ఇళ్లు నిర్మించుకొనేందుకు 2008లో అర్హత పత్రాలు ఇచ్చారు. దీని కోసం గ్రామంలోని సర్వే నెంబరు 294/బి, 60/1లలో 1.75 సెంట్ల శివాయి భూమిని ఎమ్మార్వో సర్వే చేసి తొమ్మిది అంకణాల లెక్కన రాళ్లు నాటారు. కాని ఏళ్లు గడుస్తున్నా ఈ భూమిని లబ్ధిదారులకు ఇవ్వలేదు. దీని ప్రక్కనే రియల్ ఎస్టేట్ వ్యాపారం చేసే వ్యక్తి ప్రభుత్వం మాకు కేటాయించిన భూమిలోని రాళ్లు పీకి గ్రావెల్ రోడ్డు వేసి పారే స్తున్నాడు. ఈ భూమిని కబ్జా కాకుండా చూడాల్సిన బాధ్యతను రెవిన్యూ అధికారులు స్వీకరించమనవి.

*షేక్ షానవాజ్* *గుడిపల్లిపాడు*

---

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

విభాగం అధ్యక్షురాలిగా మందలపూడి హజరత్తమ్మలను ఎన్నుకొన్నారు.

### అన్నదానం

కవి ఊరుబిండి వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి మేడేను పురస్కరించుకొని కొత్త హాల్ సెంటర్‌లో ఉచిత అన్న ప్రసాద వితరణ కార్యక్రమం చేపట్టారు.

### నవ్వుల దినోత్సవం

ప్రపంచ నవ్వుల దినోత్సవాన్ని నెల్లూరులోని హరివిల్లు క్రియేషన్స్ అధినేత దోర్నాల హరిబాబు 1వ తేది భవానీ రెసిడెన్సీ హోటల్ కాన్ఫరెన్స్ హాలులో నిర్వహించారు. అదనపు జిల్లా కలెక్టర్ సీతారామయ్య, అమరావతి హోటల్ అధినేత కృష్ణారెడ్డి, తుంగా శివప్రసాద్‌రెడ్డి, శివప్రభాత్‌రెడ్డి, పొన్నాల రామసుబ్బారెడ్డి ముఖ్య అతిథులుగా హాజరయ్యారు. హాస్య రంగంలో సేవ లందించిన సుందరరామిరెడ్డి, వ్యంగ్య రచయిత గుమ్మడి శ్రీనివాసులురెడ్డిలను ఈ సందర్భంగా సన్మానించారు.

### మండుతున్న ఎండలు

భానుడి ప్రచండ ప్రతాపానికి జిల్లావాసులు విలవిల్లాడి పోతున్నారు. రోజురోజుకు ఉష్ణోగ్రతలు పెరిగి పోతుండడంతో భరించలేని ఉక్కపోత ప్రజలను ఉక్కిరి బిక్కిరి చేస్తుంది. మే 3వ తేది ఉష్ణోగ్రత 41 డిగ్రీలుగా నమోదైంది. 4వతేది, 5వతేది కూడా గ్రీష్మప్రతాపానికి జనం విలవిలలాడి పోయారు. రానున్న రోజుల్లో ఇవి మరింతగా పెరిగే అవకాశం వుండడంతో ప్రజలు ఆందోళన చెందుతున్నారు. చిన్న పిల్లలు, వృద్ధుల పరిస్థితి మరీ ఘోరంగా వుంది.

### పెంచలకోనలో డ్రస్ కోడ్

ప్రముఖ నృసింహ క్షేత్రం పెంచలకోనలో దేవాలయ ఉద్యోగులు, సిబ్బందికి డ్రస్ కోడ్ ప్రవేశపెట్టారు. రాష్ట్రవ్యాప్తంగా తీసుకొన్న చర్యల్లో భాగంగా తెల్లని పంచె, చొక్కాలను వీరు ధరిస్తారు. మే 1వ తేది నుంచి దీనిని అమలు చేస్తున్నట్లు దేవాదాయ శాఖ అధికారులు ప్రకటించారు. డ్రస్‌తో పాటు భక్తులతో గౌరవంగా మెలిగేలా వారి మనసులను మార్చాల్సి వుంది.

### మరణం

నెల్లూరు స్వాగత్‌లాడ్జి అధినేత గువ్వల సుధాకర్‌రెడ్డి (60) 3వ తేది మరణించారు. ఆయనకు ఒక కుమారుడు, ఒక కుమార్తె వున్నారు. వారి కుటుంబానికి మా సానుభూతి.

# తీరుమారని రవాణాశాఖ కార్యాలయం!

"నెల్లూరు రవాణా శాఖ కార్యాలయంలో ఇంకా ఏజెంట్ల హవా కొనసాగుతోంది. లైసెన్స్‌ల జారీ కోసం అవసరమైన పుట్టిన తేది, నివాసం, విద్యార్హతల నకిలీ ధృవీకరణ పత్రాలను కార్యాలయంలో పనిచేసే ఓ పర్యవేక్షకుని సహకారంతో ఇద్దరు ఏజెంట్లు తయారు చేస్తున్నట్లు పోలీసుల దర్యాప్తులో తేలింది."




నిరంతర వివాదాల్లో నెల్లూరులోని రవాణాశాఖ కార్యాలయం.

నెల్లూరు రవాణాశాఖ కార్యాలయంలో లైసెన్స్‌ల జారీ విషయంలో అవినీతి, అక్రమాలు అనేక సంవత్సరాల నుంచి జరుగుతున్నాయి. గతంలో ఏజెంట్లు రవాణాశాఖ కార్యాలయంలో వివిధ రకాల పనులు చేసిపెట్టేవారు. ఏజెంట్లు వ్యవహరిస్తున్న తీరుపై ప్రజలు ఇబ్బందులు కూడా పడ్డారు. దీనిపై పలు దఫాలు ప్రభుత్వానికి ఫిర్యాదులు కూడా వెళ్లాయి. ఫిర్యాదుల అనంతరం స్పందించిన ప్రభుత్వం ఏజెంట్ల వ్యవస్థను రద్దు చేస్తున్నట్లు ప్రకటించింది.

అధికారికంగా ఏజెంట్ల రద్దు కాబడినప్పటికీ అనధికారికంగా ఏజెంట్లు కార్యాలయంలో పనులు చక్కబెట్టేవారు. ఆర్టీఓ కార్యాలయంలో సెక్షన్ పర్యవేక్షకులు బయట వ్యక్తులను కార్యాలయంలో నియమించుకొని రికార్డుల నమోదు కార్యక్రమం పూర్తిచేయించేవారు. ఇందుకు వాహనదారుల నుంచి రుసుం వసూలు చేసి అనధికారికంగా నియమించుకున్న వారికి చెల్లించేవారు. ఈ విషయం ఆర్టీఓ దగ్గర నుంచి డిప్యూటి కమిషనర్ వరకు తెలిసినప్పటికి ఒక్కరూ ఈ విధానం రద్దుకు చర్యలు తీసుకోలేకపోయారు. పరోక్షంగా అధికారుల సహకారం వుండడంతో ఏజెంట్లే ఇక్కడ హవా కొనసాగించారు.

ఈ కార్యాలయ సిబ్బంది, అధికారులపై వచ్చిన అవినీతి ఆరోపణల నేపథ్యంలో అవినీతి నిరోధకశాఖ అధికారులు నిఘా వుంచి దాడులు కూడా చేసిన సందర్భాలున్నాయి. అయినా కూడా సిబ్బందిలో ఎలాంటి మార్పు కానరాలేదు. ఏజెంట్ల ద్వారా వెళ్లిన దరఖాస్తులను పరిశీలించకుండానే ధృవీకరణ పత్రాలు జారీ చేసేవారు. అర్హత లేని వారికి సైతం లైసెన్స్‌లు జారీచేయడంతోపాటు కండీషన్‌లో లేని వాహనాలను కండీషన్‌లో వున్నట్లు ధృవీకరణ పత్రాలు ఇచ్చేవారు. లైసెన్స్ మంజూరు కావాలంటే పుట్టిన తేదీ, నివాస ధృవీకరణ పత్రాలు తప్పనిసరిగా సమర్పించాల్సి వుంటుంది.

### అధికారుల పాత్రపై అనుమానాలు

లైసెన్స్‌ల జారీ కోసం పుట్టిన తేదీ, నివాసం, విద్యార్హతల నకిలీ ధృవీకరణ పత్రాలు సమర్పిస్తున్న విషయం బయటకు పొక్కడంతో పోలీసులు నిఘా వుంచి ఇద్దరు ఏజెంట్లను అదుపులోకి తీసుకున్నారు. వీరిని తమదైన శైలిలో పోలీసులు విచారించడంతో నకిలీ ధృవీకరణ పత్రాల తయారీ తామే చేశామని ఒప్పుకొన్నట్లు తెలుస్తుంది. ఇద్దరు ఏజెంట్లకు ఆర్టీఓ కార్యాలయంలో ఓ పర్యవేక్షకుడు పూర్తి సహాయ సహకారాలు అందించారన్న ప్రచారం జరుగుతుంది. కార్యాలయంలో ఈ తతంగం అనేక నెలల నుంచి జరుగుతున్నా ఇప్పుడు బయటపడింది.

పోలీసుల విచారణలో అధికారుల పేర్లు బయటపడకుండా ఒత్తిళ్లు కూడా తెస్తున్నట్లు తెలిసింది. ఆర్టీఓ కార్యాలయంలో పట్టుబడిన ఇద్దరు ఏజెంట్ల ద్వారా జరిపిన లావాదేవీలను పరిశీలిస్తే మరిన్ని వాస్తవాలు బయటపడే అవకాశం వుంది. ఆర్టీఓ కార్యాలయంలో జరుగుతున్న కార్యకలాపాలపై ప్రభుత్వం దృష్టి సారించి ప్రక్షాళన చేయాల్సిన అవసరం వుంది.

---

# పలవరించగల కవిత్వం వేణుగానం!

సుమారు నలభై ఏళ్లకు పైగా కవి డాక్టర్ మల్లెమాల వేణుగోపాలరెడ్డి మదిలో సంఘర్షించిన భావాలకు కవిత్వీకరణం 'వేణుగానం'. ఈ కవితా సంపుటిలో మొత్తం 29 కవితలున్నాయి. ఇందులో 'నేను నేనుగా' అన్న కవితలో రచయిత రాసిన విధంగానే కవిత్వ రూపంలో చేదు నిజాలను నిక్కచ్చిగా నిలదీసి చెప్పిన ఘాటైన మాటలున్నాయి. ఈ 29 కవితలలో రచయిత సున్నిత హృదయం, నిష్కల్మషమైన ఆత్మ, సులువైన పదాలతో నిత్య నూతనంగా ప్రతిఫలించింది. సున్నితమైన హృదయంతోపాటు రచయితకు గల సామాజిక స్పృహ పాఠకులను స్పందింపజేస్తుంది. ఈ కవితల్లో ఒకటో, రెండో తప్ప మిగిలినవన్నింటి వస్తువూ 'సామాజిక కాలుష్యమే'. అబలలు, వృద్ధులు, బాలకార్మికులు, అనాథ జీవులు, బాలలు, అధికారులు, కడప బాంబులు, రాజకీయాలు, కరవు, కుటుంబ నియంత్రణ, శుష్క పంచాంగ శ్రవణాలు, నిరుపయోగ రాజకీయాలు, కడప జిల్లా విశిష్టత తదితర గత, వర్తమాన వస్తువులు రచయిత కవితా శిల్పంలో ఇట్టే ఒదిగి పోయాయి. ఇందులో ఆచరణ యోగ్యమైన చరణాలు చాలానే వున్నాయి. ముఖ్యంగా అమృతం, అవతరణం, శాంతియజ్ఞం, పెద్దయ్యకు పెద్దలేఖ, నైవేద్యం, నా దేశం, కవన విజయం, లైఫ్ అంతా, కాముక క్రీడ వంటి కవితల్లో కవి ఆగ్రహం, వ్యంగ్యం, నిర్వేదం పాఠకులను ఆలోచింపజేస్తాయి. ముఖ్యంగా అవతరణ కవితను రచయిత వ్యక్తీకరించిన టెక్నిక్ చక్కగా వుంది. కవిత్వంలో ప్రయోగాలు జరగాల్సిన అవసరాన్ని గుర్తుకు తెస్తుందీ కవిత. భావకుడైన రచయిత బాధ్యతతో రాసిన కవిత్వం ఇది. ఎక్కడుందీ? అనే కవితలో ఆత్మ పరమాత్మల తత్వాన్ని రచయిత వ్యక్తీకరించిన తీరు ఇందులో వాడిన Imager అద్భుతం. పాఠకులను చాలాకాలం వెంటాడే కవిత ఇది. ఇందులోని కొన్ని కవితలను మరో మారు తిరగరాసి ప్రచురించి వుంటే ఇంకా బావుండేది. అలాగే 'ఉవిద', 'ప్రవిమలుడు' వంటి పదాల వాడకాన్ని తగ్గించి వుండాల్సింది. నిజానికి రచయిత సీరియస్‌గా కవిత్వ సాధన చేసి వుంటే మరిన్ని మంచి కవితలు రాసి వుండేవారు. ఎందుకో నలభై ఏళ్ల వేణుగోపాలరెడ్డి కవిత్వంలో చెప్పుకోదగ్గ మార్పు లేదు. ఇందుకు రచయిత దైనందిన జీవితం కారణం అయి వుండొచ్చు. వేణుగోపాలరెడ్డి లాంటి వారు తరచూ కవిత్వం రాయాల్సిన సామాజిక అవసరం సమకాలీన కవితా సమాజంలో వుంది. ఏదిఏమైనా కవిత్వ ప్రియులు, ఉద్యమకారులు నిస్సంకోచంగా చదివి అనుభవించి, పలవరించగల కవిత్వం ఇది.

> **'వేణుగానం'**
> (కవితా సంపుటి)
>
> రచయిత : **డాక్టర్ మల్లెమాల వేణుగోపాలరెడ్డి**
> విశ్లేషకులు : **డాక్టర్ లెనిన్ ధనిశెట్టి**
> పేజీలు : **119** ధర : **రూ.50/-**
>
> **ప్రతులకు**
> ఎస్.వి.కృష్ణజయంత్
> 19-90, P&T Colony
> దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్
> మరియు
> రాష్ట్రంలోని అన్ని ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలలో.

---

• ప్రభుత్వ పాఠశాలల్లో

# సఫలంకాని కంప్యూటర్ విద్య!



నెల్లూరు జెండావీధిలోని పిఎన్ఎమ్ స్కూల్‌లో వాడని కంప్యూటర్లు.

ప్రైవేట్ విద్యాసంస్థల్లో చదివే విద్యార్థులకు దీటుగా ప్రభుత్వ పాఠశాలల్లో, కళాశాలల్లో చదివే విద్యార్థులను తయారు చేయాలని ప్రభుత్వం భావిస్తున్నా అధికారుల నిర్లక్ష్యం, ప్రణాళికాబద్ధంగా వ్యవహరించలేకపోవడం ప్రభుత్వ లక్ష్యాన్ని నీరుగారుస్తున్నాయి. తగినంత ఉపాధ్యాయులు లేకపోయినా, మౌలిక సదుపాయాలు కొరవడినా తమ ప్రతిభాపాటవాలతో ప్రభుత్వ పాఠశాలల్లో చదివే విద్యార్థులు మిగతా పాఠశాలల విద్యార్థులకు తీసిపోని రీతిలో రాణిస్తున్నారు. వీరికి ప్రైవేట్ విద్యాసంస్థల్లో మాదిరిగా చిన్ననాటి నుంచే కంప్యూటర్ విద్యను అందించాలని ప్రభుత్వం భావించి గతంలో జిల్లావ్యాప్తంగా పలు పాఠశాలలకు కంప్యూటర్లను అందించింది. విద్యార్థులకు కంప్యూటర్ విద్యను బోధించేందుకు తగిన శిక్షకులు లేకపోవడం అటుంచితే, అధికభాగం పాఠశాలలకు విద్యుత్ సరఫరా లేకపోవడంతో కొద్ది కాలానికే కంప్యూటర్లన్నీ మూలనపడ్డాయి. ఈ పరిస్థితుల్లో రాజీవ్ విద్యామిషన్ ఈ ఏడాది నుంచి తిరిగి పాఠశాలల విద్యార్థులకు కంప్యూటర్ విద్యను అందించేందుకు సిద్ధమైంది. దీనిలో భాగంగా ముందుగా కొంతమంది ఉపాధ్యాయులకు శిక్షణనిస్తున్నారు. దీనిపై ఉపాధ్యాయులు, విద్యార్థుల తల్లి దండ్రుల నుంచి విమర్శలు వ్యక్తమవుతున్నాయి.

కార్పొరేట్ విద్యాసంస్థలకు దీటుగా కంప్యూటర్ విద్య, ఆంగ్ల మాధ్యమం అని చెప్పి ఆర్భాటపు ప్రకటనలు చేయడం తప్ప ఆచరణలో విఫలం అవుతుండడంపై అధికారుల తీరును తప్పుపడుతున్నారు వారు. ఈ పేరుతో నిధులు దిగమింగడం తప్ప నిజంగా ప్రభుత్వ పాఠశాలల్లో చదివే విద్యార్థులకు ఎలాంటి ఉపయోగం ఉండడం లేదన్నది కాదనలేని నిజం. రాజీవ్ విద్యామిషన్‌లో కొందరు కంప్యూటర్‌ల పంపిణీ, మరమ్మత్తుల పేరిట పలు అక్రమాలకు పాల్పడుతున్నారని గత కొంతకాలంగా ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. ఈ నేపథ్యంలో ఈ ఏడాదైనా సక్రమంగా విద్యార్థులకు కంప్యూటర్ విద్యను అందించాలని పలువురు కోరుకొంటున్నారు.

Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/09-11



సామ్రాజ్యవాద కాంక్షతో, క్రైస్తవ మత పిచ్చితో అమెరికా ప్రపంచం మొత్తం మీద చేస్తున్న, చేయిస్తున్న అరాచకాలను ప్రతిఘటించడానికి...

# ఒసామా వంటి యోధులు అవసరమే!

"ఒసామా బిన్ మహమ్మద్ బిన్ అవాద్ లాడెన్" వీర మరణం పొందాడు. 7వ శతాబ్దిలో మహమ్మద్ ప్రవక్త ముస్లిం వ్యతిరేకులను ఉత్తరాఫ్రికా, పశ్చిమ ఆసియా ప్రాంతాలలో తుడిచిపెట్టిన విధంగా, ప్రస్తుత ప్రపంచంలో ఇస్లాం మత రాజ్యాలను స్థాపించాలని కలలు కన్న ఒక యోధుడు, తన కల నెరవేరకుండానే కన్ను మూశాడు.

భూగోళం సమస్తం తమ పాదాల క్రింద తారాడేట్లు చేయగలమని విర్రవీగే అమెరికన్ దురహంకారం పై గొడ్డలి వేటు వేసిన ధీరుడు, శూరుడు బిన్ లాడెన్. ఆయన హింసాయుత ప్రవృత్తిని సమర్ధించడం మానవత్వం వున్న వారెవ్వరూ చేయలేని పని. కానీ ఒక లక్ష్యం కోసం కొండను ఢీ కొనడానికి ఆయన సిద్ధపడిన తీరు మాత్రం ఆశ్చర్యం కల్గించి తీరుతుంది. మహా మేరు పర్వతం వంటి అమెరికన్ సామ్రాజ్యాన్ని గడగడ లాడించిన తీరు అభినందనలకు నోచుకొంటుంది.

ఆధునిక చరిత్రలో జర్మనీ నియంత అడాల్ఫ్ హిట్లర్, రష్యా ఉక్కు మనిషి జోసెఫ్ స్టాలిన్ తర్వాత అమెరికాను వణికించిన ప్రపంచ నేత ఒసామా బిన్ లాడెన్ మాత్రమే అనడం అతిశయోక్తి కాదు. ఆ ప్రపంచ నేతలతో సరితూగ గల్గినవాడు బిన్ లాడెన్.



బిన్ లాడెన్ ప్రాణాలను చాలా రోజులు కాపాడిన తోరాబోరా గృహలు.

## బలంగా నాటుకొన్న మతమౌఢ్య బీజాలు!

ఒసామా పుట్టిన దేశం సౌదీ అరేబియా. ఆయన తండ్రి మక్కా మసీదు దర్శనానికి వచ్చే యాత్రీకుల సామాను మోసే కూలీగా పని చేసేవాడు. ఆ తర్వాత కాంట్రాక్టర్‌గా మారి, సౌదీ అరేబియాలోనే అతి పెద్ద నిర్మాణ రంగ కంపెనీకి అధిపతిగా ఎదిగాడు. బిన్ లాడెన్ కుటుంబ ఆస్తుల విలువ 22వేల కోట్ల రూపాయలకు పైమాటే అని అంచనా. ఒసామా తండ్రికి నలుగురు భార్యలు, 50 మంది పిల్లలు. వారిలో ఒసామా 17వవాడు. ఆయన తల్లి సిరియా దేశస్తురాలు. ఆమెను ఆ కుటుంబంలో బానిసగా చూసేవారట. అందువల్ల ఒసామా బిన్ లాడెన్ కూడా చిన్నతనంలో బానిస బిడ్డగా అవమానాలు ఎదుర్కొన్నాడు. తతిమా పిల్లలందరూ విదేశాలకు వెళ్లి, పాశ్చాత్య విద్య అభ్యసిస్తే, ఒసామాను మాత్రం వున్న చోటనే మామూలు బడిలో చదివించారు. జెడ్డాలో చదివేటప్పుడు, అబ్దుల్లా అజాం అనే ప్రొఫెసర్ ప్రభావం ఒసామా మీద ప్రగాఢంగా పడింది. చరిత్రలో ముస్లిం రాజ్యాలుగా వుండిన ప్రాంతాలన్నిటినీ, ఇజ్రాయెల్‌తో సహా, తిరిగి ముస్లిం రాజ్యాలుగా మార్చే వరకు "జిహాద్" నడిపించాలని బోధించే వాడట ఆ ప్రొఫెసర్. అట్లా విద్యార్థి దశలోనే ఒసామాలో మతమౌఢ్య బీజాలు బలంగా నాటుకొన్నాయి.

ఆఫ్ఘనిస్తాన్‌పై రష్యా దురాక్రమణ ఒసామాకు బంగారు వంటి అవకాశాన్ని కల్పించింది. రష్యా దురాక్రమణను ప్రతిఘటించడానికి అమెరికా, సౌదీ అరేబియా ప్రభుత్వాలు అక్కడి తిరుగుబాటు దారులకు వేల కోట్ల రూపాయల డబ్బు, ఆయుధాలు ఇచ్చాయి. ఆ సహాయాన్ని పర్యవేక్షించి, తిరుగుబాటుదారులకు స్ఫూర్తినివ్వడానికి సౌదీ అరేబియా రాజ కుటుంబం నుంచి ఒకరిని పంపమని అమెరికా కోరిందట. కానీ అందుకు ఏ రాజ కుటుంబీకుడూ అంగీకరించలేదు. సుఖంగా వున్న ప్రాణాన్ని కష్టపెట్టుకొని, యుద్ధ భూమిలో తిరగడానికి ఎవరికి బుద్ధి పడుతుంది? ఆ సమయంలో ఒసామా సౌదీ ప్రభుత్వం తరఫున పాకిస్తాన్ వెళ్లాడు. ఆఫ్ఘన్ తిరుగుబాటు దారులతో సన్నిహితంగా మెలిగాడు. ఆయనకు ప్రొఫెసర్ అజాం తోడుగా నిలిచాడు. ఆ సహజీవనం ఒసామాను పూర్తిస్థాయి జీహాద్ యోధుడిగా మార్చివేసింది. అరబ్ రాజ్యాలలో పేద పిల్లలను చేరదీసి, ఆయుధ శిక్షణ ఇచ్చి, రష్యా మీద యుద్ధానికి పురికొల్పే వారు. ఒక దశలో ఒసామా నియంత్రణలో 20వేల మంది అరబ్ సైనికులుండేవారంటే, ఆయన శక్తి సామర్థ్యాలను అంచనా వేసుకోవచ్చు. దాదాపు పదేళ్ల పాటు ఒసామా ఆఫ్ఘనిస్తాన్ యుద్ధంలోనే కాలం గడిపాడు. చివరకు 1989లో రష్యా ఓటమి అంగీకరించి, ఆఫ్ఘనిస్తాన్ వదలి వెళ్లిపోయింది.

## ఆఫ్ఘనిస్తాన్‌తో సాన్నిహిత్యం

ఈ యుద్ధం ఫలితంగా ఒసామాకు ఆఫ్ఘనిస్తాన్‌తో సాన్నిహిత్యం పెరిగిపోయింది. రష్యా నిష్క్రమణ తర్వాత ఆ దేశ పాలకులుగా వచ్చిన తాలిబన్లకు ఆర్థిక సహాయం చేయడం ద్వారా వారికి మరింత దగ్గరై పోయాడు. ఆ దశలో ఇరాన్ – ఇరాక్‌ల మధ్య యుద్ధం మొదలైంది. దాన్ని సాకుగా చూపించి అమెరికన్ ప్రభుత్వం సౌదీ అరేబియాలో తన సైనిక స్థావరం నెలకొల్పింది. సౌదీ రాజులు అమెరికన్ల చేతిలో కీలుబొమ్మలుగా మారారు. అది ఒసామాకు నచ్చలేదు. ప్రతిఘటించడానికి ప్రయత్నించాడు. కుదరలేదు. ఇక అక్కడ వుండడం ఇష్టం లేక, సూడాన్ దేశం వలస వెళ్లాడు. అక్కడ వున్నప్పుడే "అల్ ఖైదా"కు అంకురార్పణ జరిగింది. ఈజిప్ట్ నుంచి చెచెన్యా వరకు, ఫిలిప్పైన్స్ నుంచి యెమెన్ వరకు, పాలస్తీనా, ఆఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్ వంటి దేశాలలో వున్న ముస్లిం తీవ్రవాద సంస్థలన్నిటితో సంబంధాలు నెలకొల్పుకొన్నాడు. వారందరినీ తన నియంత్రణలోకి తెచ్చుకొన్నాడు. ఆ తర్వాత తన మకాం ఆఫ్ఘనిస్తాన్‌కు మార్చాడు.

ఈ దశ వరకు ఒసామాను అమెరికన్ ప్రభుత్వం పెద్దగా లెక్క చేయలేదు. ముస్లిం తీవ్రవాద సంస్థలకు ధన సహాయం చేసే ఫైనాన్షియర్‌గా మాత్రమే చూసింది. కానీ తీవ్రవాదులకు ధన సహాయం కాక, తీవ్రవాదానికే ఊపిరి పోస్తున్న ప్రమాదకారిగా గుర్తించలేక పోవడం అమెరికన్ నిఘా వర్గాల వైఫల్యం.



మూగబోయిన అమెరికన్ వ్యతిరేక గళం.

## అమెరికన్లను కాల్చి చంపండి!

ప్రపంచ వ్యాప్తంగా ముస్లిం తీవ్రవాద సంస్థల వ్యవస్థ వెళ్లూనుకొన్నదని నమ్మకం కుదరగానే, 1998లో మొదటి సారిగా "అమెరికన్ దేశ ప్రజలు ఎక్కడ కన్పిస్తే అక్కడ కాల్చి చంపండి" అని పిలుపు ఇచ్చాడు ఒసామా. ఆ ప్రకటనతో వులిక్కి పడిన అప్పటి అమెరికన్ అధ్యక్షుడు బిల్ క్లింటన్ ఒసామాను తమ మొదటి శత్రువుగా ప్రకటించాడు. అప్పటి నుంచి ఒసామా జాడ పసిగట్టడానికి సిఐఎ చేయని ప్రయత్నం లేదు. కానీ ఒసామా గురించి చిన్నపాటి సమాచారం కూడా రాబట్టలేక పోయారు వారు.

ఒసామా సమర్థత అంతా ఈ దాగుడుమూతలాటలోనే వ్యక్తమౌతుంది. ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని వినియోగించుకోవడంలో ఒసామా తర్వాతనే, ఏ తీవ్రవాద నాయకుడైనా. అమెరికన్ నిఘా సంస్థలకు దొరకని ఒసామా అమెరికన్ టీవీ ఛానళ్లకు, పత్రికా విలేఖరులకు మాత్రం అందుబాటులో వుండేవాడు. తన వాదనను బలంగా విన్పించడంలో ఒసామా చాతుర్యం అపారం.

## ఎవరు తీవ్రవాదులు?

"మా దేశాలను ఆక్రమించుకోవడం, మా ప్రకృతి వనరులను దోచుకోవడం, మమ్మల్ని పరిపాలించడానికి తొత్తులు వంటి పాలకులను నియమించడం, వాటన్నిటినీ మేము అంగీకరించి తీరాలని ఒత్తిడి చేయడం, అమెరికన్ ప్రభుత్వ విధానం. అందుకు మేము అసమ్మతి తెలిపితే, మా మీద తీవ్రవాదులనే ముద్ర వేస్తారు. పాలస్తీనాలో పసి పిల్లలు ఇజ్రాయిల్ సైనికుల మీద రాళ్లు రువ్వితే, వారిని తీవ్రవాదులుగా పిలుస్తారు. అదే ఇజ్రాయిల్ సైన్యం పసి పిల్లలను చంపుతూ వూళ్ల మీద బాంబుల వర్షం కురిపిస్తే మాత్రం తీవ్రవాద నిర్మూలన అంటారు. ఇదెక్కడి న్యాయమో చెప్పండని సిఎన్ఎన్ టీవీ ఛానల్‌కు ఇచ్చిన ఇంటర్వ్యూలో ఒసామా చేసిన బలమైన అభ్యర్థన అమెరికన్ ప్రజానీకాన్ని కూడా ఆలోచింప చేసిందంటే ఆయన వాక్చాతుర్యం ఎంత గొప్పదో అర్థం చేసుకోవచ్చు.

1999లో నైరోబి, దర్రైసలాంలోని అమెరికన్ దౌత్య కార్యాలయాల మీద ట్రక్కు బాంబులు పేల్చాడు. 224 మందిని చంపాడు. దానితో అమెరికన్ ప్రభుత్వం వులిక్కి పడింది. ప్రతీకారంగా ఆఫ్ఘనిస్తాన్‌లో ఒసామా దాగి వున్నాడని అనుమానం కల్గిన ప్రతి ప్రదేశంపై బాంబుల వర్షం కురిపించింది. దానికి ప్రతీకారంగా 2001 సెప్టెంబర్ 11తేది వరల్డ్ ట్రేడ్ సెంటర్, పెంటగాన్‌లను ధ్వంసం చేయించాడు.

అప్పటి నుంచి ఒసామా పేరు చెప్తే అమెరికన్ పాలకులకు వెన్నులో చలి

కొరవ 14వ పేజీలో

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.